# శతము

# ౧౦౦

## యోగీశ్వరుల రచనలలో 100వ గ్రంథము

రచయిత: త్రిమత ఏకైక గురువు
ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త
ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త
శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

www.thraithashakam.org





# శతము

# ౧౦౦

# 100


<u>రచయిత :</u> **త్రిమత ఏకైక గురువు**

**ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, 100 వ గ్రంథకర్త**

**ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త**

## శ్రీ.శ్రీ.శ్రీ. ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు






<u>ప్రచురించిన వారు</u>

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-41   ద్వితీయ ముద్రణ : ఏప్రిల్-2019

ప్రతులు : 1000   **వెల : 80/-**

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దెయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మపత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర.
41) భావము-భాష.
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము.
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము.
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు.
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.
76) నాది లోచన-నీది ఆలోచన.

77) ద్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) ఏది సత్యము-ఏది అసత్యము.
90) ఒక వ్యక్తి రెండు కోణములు.
91) అంతిమ దైవగ్రంథములో వజ్ర వాక్యములు.
92) బ్రహ్మ-రావణబ్రహ్మ-భగవాన్ రావణబ్రహ్మ.
93) ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు.
94) హిందూ ధర్మమునకు రక్షణ అవసరమా?
95) వేదములు మనిషికి అవసరమా?
96) ఉపనిషత్తులలో లోపాలు.
97) ఖుర్ఆన్, హదీసు ఏది ముఖ్యము?
98) భక్తిలో మీరు సంసారులా? వ్యభిచారులా?
99) ౧౦౦, శతము, 100
100) సుప్రసిద్ధి బోధ.
101) సిద్ధి బోధ.
102) సత్యార్థ ప్రకాశికలో సత్యమెంత.
103) రూపము మారిన గీత.
104) పోలీసులు-నేరస్థులు.
105) ఇప్పటి మానవుని పరిస్థితి.
106) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్ఠి-సృష్ఠికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?
79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.

88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని అజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము.
125. అక్షర జ్ఞానము.
126. లలా జలము.
127. దైవ ధర్మములు-మత సాంప్రదాయములు
128. ఆహారము నీకా! నీ ఆత్మకా!!
129. మాత్ర-మందు.
130. కాలచక్రం.
131. బ్రహ్మవిద్య.
132. శక్తి.
133. పౌర్ణమి-అమావాస్య.
134. ఈశ్వర-పరమేశ్వర.
135. పురుషోత్తమ-శ్రీరామ.
136. దేవునికి ఒక్కడే కుమారుడు-
దేవునికి అనేకమంది కుమారులు.
137. జలం.
138. అధిపతి.
139. గ్రహాంతర వాసులు.
140. దేవుడు ద్వితీయుడా? అద్వితీయుడా?
141. మనిషి చేతిలో భగవంతుడు-
దేవుని చేతిలో మనిషి.
142. శరీరములో రక్తము-
గ్రంథములో జ్ఞానము
143. గ్రంథములో జ్ఞానము-
మనిషిలో రక్తము.
144. త్రైత సిద్ధాంత చరిత్ర.
145. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి (ప్రెసిడెంట్)**
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ (సూర్య మీ సేవా)**
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య (టీచర్) (ప్రెసిడెంట్)**
ప్రబోధాశ్రమము, తాడిపత్రి (మం)
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ (ప్ర.సభ్యుడు)**
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర (ప్రెసిడెంట్)**
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య (ప్ర.సభ్యుడు)**
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక (Head Office)**
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు (ప్ర.సభ్యుడు)**
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు (టీచర్) (ప్రెసిడెంట్)**
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్ (వైస్ ప్రెసిడెంట్)**
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ (వైస్ ప్రెసిడెంట్)**
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు (ప్రెసిడెంట్)**
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ (ప్రెసిడెంట్)**
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి** (ప్రెసిడెంట్)
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లినిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్)
MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 7989100433, 9246770277.

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్రెసిడెంట్)
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)**
(ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హొస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 527 3436, +1(210) 668 8963

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# ౧౦౦, శతము, 100

ఈ గ్రంథము పేరును మూడు సంఖ్యలుగా వ్రాశాము. గణిత శాస్త్ర సంబంధముగా ఒకటి, రెండు సున్నాలను చూపడము జరిగినది. గణితములో మూడు సంఖ్యలుగా యున్న పేరును తెలుగు అక్షరములలో వంద, నూరు, శతము అని మూడు విధముల చెప్పవచ్చును. గణితములో మూడు సంఖ్యలు ఉండుట వలన అదే పదమును తెలుగులో మూడు అక్షరముల శతము అను పదమును తీసుకొందాము. తెలుగు భాషలో శతము అనగా, గణిత సంఖ్యలో మూడు సంఖ్యలుగ యున్నది. ఇప్పుడు మనము చెప్పుకోవలసినది ఆధ్యాత్మికము. కావున తెలుగులో శతము గానీ, సంఖ్యలలో 100 గానీ ఈ గ్రంథము పేరు. **శతము అను పదము శాతము అను పదము నుండి పుట్టినది.** శాతము అనగా నూరు భాగము లుగా విభజింపబడినదియని అర్థము. తెలుగు అన్ని భాషలకంటే ముందు పుట్టిన భాషయని ముందు నుండి చెప్పుచున్నాను. ప్రపంచములో ఒకరి భావమును మరియొకరు తెలియుటకు భాష ఏర్పడినది. భావమును అనుసరించి పుట్టినదానిని భాష అంటున్నాము. భావములను మనిషి ఎన్ని భాషలలోనయినా చెప్పవచ్చును. భావముతో కూడుకొన్నది భాషగానీ భావములేనిది భాష కాదు.

పూర్వము ఒక మనిషి తన ఉద్దేశ్యమును తెలుపుటకు చేతి సైగల ద్వారా తెల్పెడివారు. అట్లే నటనల ద్వారా తెలిపెడివారు. ఎలా తెలిపినా ఒక మనిషి యొక్క భావము ఇంకొక మనిషికి చేరుటకు కొంత కష్టముగా ఉండేది. ఒక మనిషి తన భావమును నూటికి నూరు శాతము సైగల ద్వారా తెలియజేస్తే అది ఎదుటి మనిషికి 20 నుండి 30 శాతము అర్థము అయ్యేది. ఇంకా కొందరికి 20 నుండి 40 శాతము అర్థమయ్యేది. కొంత

తెలివైన వారికి 20 నుండి 50, 60, 70, 80 శాతము వరకు అర్థమయ్యేది. చివరకు 20 శాతము అర్థమయ్యేది కాదు. అటువంటి పరిస్థితులలో జంతువులను చూసి వాటివలె తాము కూడా శబ్దముతో భావమును ప్రకటించాలని అనుకొన్నారు. ఒకరోజు కోతులు చెట్టుక్రింద పడిన ఆకులను, గింజలను తినుకొంటూ అప్రమత్తముగా ఉన్నప్పుడు ఆ గుంపులోని కోతి ఒకటి నాయకుడుగా ఉండి బయట ప్రమాదములను గమనిస్తూయుండి, ఏదయినా ప్రమాదము అని తెలిసినప్పుడు నోటితో గుర్‌మని శబ్దము చేస్తే, మిగతా కోతులన్నీ ఆ భావమును గ్రహించి వెంటనే అక్కడ నుండి పారిపోయి చెట్టు ఎక్కి ప్రమాదము నుండి తప్పించుకోవడము భాషలేని కాలములోనే మనిషి చూచాడు.

అంతేకాక కోడి తన పిల్లలకు ఆహారముంది ఇక్కడకు రండి అని చెప్పుటకు ఒక రకముగా శబ్దము చేస్తే, ఆ శబ్దములోని భావమును గ్రహించిన కోడిపిల్లలు వెంటనే తల్లియొద్దకు పరిగెత్తి పోవడము జరుగు చుండును. అట్లే కోడి తన పిల్లలకు ప్రమాదమును గురించి తెల్పుటకు పైన గద్దలు కనిపిస్తూనే ప్రమాదము అన్నట్లు మరియొక రకమైన శబ్దమును చేయును. అప్పుడు ఆ శబ్ద భావమును గ్రహించిన కోడిపిల్లలు వెంటనే తమకు దగ్గరగా యున్న రక్షణ స్థలములోనికి పారిపోవును. అప్పుడు పిల్లలు తల్లివద్దకు రాలేవు. వాటికి దగ్గరగాయున్న చాటుకు పరుగెత్తి గద్దకు కనిపించకుండా ఉండును. దీనినిబట్టి చూస్తే మనిషికంటే తెలివి తక్కువవి అనుకొన్న జంతువులు, పక్షులు మనిషికంటే ముందే భాషను కల్గియున్నాయనీ, భాషను నేర్చియున్నాయనీ తెలియుచున్నది. జంతువుల కంటే, పక్షులకంటే తెలివైన మనిషికి భాష లేదు, భాష రాదు అనడము సిగ్గుచేటుగా కనిపించి, అప్పుడు పశువులు, పక్షులవలె భాషను కల్గియుండ

వలెనను నిర్ణయానికి మనుషులు వచ్చారు. తమకు భాష అంటే ఏమిటో తెలియని పరిస్థితులలో ఆధ్యాత్మిక ధ్యానములో ఉండే గురువువద్దకు పోయి పశువులను, పక్షులను చూపించి వాటివలె తమకు భాష కావలెనని సైగల ద్వారా తెలుపుకొన్నారు.

అప్పుడు ఆత్మజ్ఞానులయినవారు కొన్ని శబ్దములను చెప్పి, ఈ శబ్దమునకు ఈ అర్థము అని అర్థమగునట్లు చేశారు. అలా మొదట నేర్పిన లేక మొదట చెప్పిన శబ్దము **"ఓం"** మొదట అందరూ నేర్చిన అక్షరము ఓం. ఓం అంటే దేవుడు అని మొదట అర్థమగునట్లు చేశారు. తర్వాత ఆకాశమును చూపి **"న"** అని గుర్తు చూపారు. అట్లే **"మ"** శబ్దమును చెప్పి గాలిని చూపించారు. తర్వాత అగ్ని, నీరు, భూమి కనిపించునవే కావున వాటికి **శి వా య** అను మూడు అక్షరములను చూపారు. పంచ భూతములయిన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను వాటికి ఒక్కొక్క దానికి ఒక్కొక్క శబ్దమును చెప్పి, ఆ శబ్దమునకు తగినట్లు అప్పుడే లిపిని కూడా తయారు చేసి, ఐదు భూతములకు ఐదు అక్షరములను తయారు చేసి, వీటికంటే మొట్టమొదట చెప్పిన "ఓం" ను కూడా కలిపి చూపడమైనది. ప్రపంచములో మానవుడు మొట్టమొదట నేర్చిన భాష తెలుగు భాష. ఆ తెలుగు భాషలో దేవున్ని "ఓం" గా చూపించి, దాని తర్వాత మిగతా ఐదు అక్షరములను చూపించి వాటిని ప్రకృతికి గుర్తుగా చెప్పారు.

ఇక్కడ బాగా గమనించితే ప్రకృతి అయిన ఐదు భాగములకు పెద్దయని తెలియునట్లు, దేవునికి గుర్తుగా "ఓం" ని చూపారు. దీనిని పద్ధతిగా వ్రాస్తే 'ఓమ్" అని ఉంటుంది. మిగతా ప్రకృతియైన ఐదు

భూతములకు న, మ, శి, వా, య అని గుర్తులు కలవు. పంచభూతములకు ఒక్కొక్క దానికి ఒక్కొక్క అక్షరమును ఉంచగా దేవుని గుర్తుకు మాత్రము రెండు అక్షరములతో కూడిన (సంయుక్తాక్షరమైన) ఓమ్‌ను ఉంచడము జరిగినది. అట్లుంచడములో పంచ భూతములన్నీ దేవునికి తక్కువ అన్నట్లు ఒక అక్షరముతో చూపించారు. దేవుడు వీటికంటే పెద్దయగుట వలన వాటికంటే అధికముగా రెండు అక్షరములు కలసిన అక్షరమును చూపడ మైనది. ఈ విధముగా తెలుగు భాషా ప్రస్థానము దేవుడు, ప్రకృతితో మొదలయినది. ఆ రోజు చెప్పినవారు ఆత్మజ్ఞానమును తెలిసిన ఆధ్యాత్మిక వేత్తలయిన దానివలన మొదట దేవుని విధానములోని బీజాక్షరములను నేర్పి, తర్వాత వాటివలన తయారయిన మిగతా భాషను నేర్పడము జరిగినది. అందువలన తెలుగు భాషలో ప్రతి పదము భావయుక్తమైన అర్థము కల్గియుండును. తర్వాత తయారయిన మిగతా భాషలలో పదములో భావము ఇమిడియుండదు. తెలుగులో అట్లుకాకుండా ప్రతి శబ్దము ఆధ్యాత్మిక భావమునకు దగ్గరగాయుండును.

భావము అను పదము నుండి పుట్టిన పేరే భాష. అందువలన మొదట పుట్టిన తెలుగు భాష భావముతో ముడిపడియుండును. తెలుగు భాషలో అన్ని పదములు, అన్ని శబ్దములు ఆధ్యాత్మికమునకు దగ్గర సంబంధము కల్గియుండును. మనిషిలో ఆత్మజ్ఞానము కల్గుకొలది తెలుగు భాష యొక్క మాధుర్యము తెలియును. తెలుగు భాష దేవునికి ఎంత దగ్గరగా యున్నదో తెలియును. తెలుగు భాష వలననే ఆత్మ విషయము (దేవుని విషయము) తెలియును అనునట్లు మొదటనే **'ఓం నమశివాయ'** అను ఆరు అక్షరములను నేర్పించారు. అంతేకాక ప్రకృతికి సంబంధించిన పంచ భూతములకు నాశనము కానివాడు దేవుడు అన్నట్లు, మొదట

రెండు శబ్దములతో కూడిన సంయుక్తాక్షరమును పెట్టారు. అట్లు పెట్టిన 'ఓమ్' ను 'పంచాక్షరి' అని అన్నారు. పంచాక్షరి అనగా! ఐదుకు నాశనము కానిదియని అర్థము. అనగా పంచభూతములకు నాశనము కానివాడు దేవుడు అని అర్థము. పంచ అనగా ఐదు అనియు, అక్షరీ అనగా నాశనము కానిదని అర్థము. ఇట్లు ఓమ్ నమశివాయ అను మొదట నేర్పిన వాటిలో అర్థముండగా, మిగతా భాషలలో కూడా లోతుగా చూస్తే అంతో ఇంతో ఆధ్యాత్మికమే కనిపించును. ఓమ్ అను శబ్దము మొదట పుట్టినది కావున దానిని ప్రథమ అక్షరమనేవారు. **ప్రథమ అక్షరము** కాలక్రమమున కొంతమార్పు చెంది **ప్రణవ అక్షరము**గా మారిపోయినది. ఎక్కడయినా ప్రణవ అక్షరము అంటే అది ప్రథమ అక్షరముగా మీరు లెక్కించుకోండి.

ఓమ్ అనేది దేవుడు అయితే మిగతా ఐదు అక్షరములు జీవులు అని అర్థము. జీవులను భూతములు అని చెప్పెడివారు. మొదట తెలుగు భాష ప్రారంభములో ఆత్మకు (దేవునికి) గుర్తయిన ఓమ్ ను దేవుడు పుట్టించాడు. తర్వాత ఐదు ముఖ్యమైన మహా జీవులను పుట్టించాడు. మహా భూతములు, భూతములు అనునవి రెండు రకములు గలవు. మహా భూతములనగా భూతములకు ఆధారమైనవని అర్థము. ఆ మహా భూతములే ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి. ఈ ఐదు మనుషులవలె ఉండు జీవులు కావు. జీవులకు పెద్ద అయిన అనగా మనుషులకు మరియు సమస్త జీవరాసులకు పెద్ద అయిన ఆత్మను (దేవున్ని) అట్లే సమస్త జీవ రాసులకు ఆధారమైన మహాభూతములను దేవుడు ప్రజలకు తెలియునట్లు ఓమ్, న, మ, శి, వా, య అను అక్షర రూపములో పుట్టించాడు. **తెలుగు భాష మిగతా అన్ని భాషలలాంటిది కాదు. దైవజ్ఞానమును తన వెంట పెట్టుకొని పుట్టిన భాషయని చెప్పవచ్చును.** నేను చెప్పునది మీకు

అర్థమవుతూవుంటే ఇప్పుడు మీకు ఒక ప్రశ్న వచ్చి తీరవలెను. అలా ఏదయినా ప్రశ్నను మీరు అడిగితే మీకు నేను చెప్పునది అర్థమవుతూ ఉందని అనుకుంటాను. మీరు ప్రశ్న అడగలేకపోతే ఇప్పుడు నేను చెప్పినది అర్థము కాలేదు అని అనుకుంటాను.

**ప్రశ్న :- స్వామీ! మీరు చెప్పునది అరటిపండు వలిచి ఇచ్చి నట్లున్నది. ఇంకా అర్థము కాలేదు అంటే మా అంత అజ్ఞానులే ఉండరు. మాకు బాగా అర్థమయినది. ఇప్పుడు అడుగవలసిన ప్రశ్న కూడా వెంటనే మాకు స్ఫురణకు వచ్చినది. అది ఏమనగా! ఓమ్ అనే దేవున్ని తర్వాత ముఖ్యమైన జీవులను పుట్టించినవాడు ఎవడు? దేవుడు అనగా ఓమ్ రూపములో పుట్టాడని, ఆ దేవుడే జీవరాసులకు పెద్దయని చెప్పారు కదా! తర్వాత ఇంకొక దేవుడు లేడు కదా! ప్రపంచానికి ఉన్నది ఒకే దేవుడయినప్పుడు ఆ దేవున్ని, పంచభూతములను ఎవరు సృష్ఠించారు అని అడుగు చున్నాను. ఇది ప్రపంచములో ఎవరికయినా వచ్చు ప్రశ్నయే అగుటవలన మీరు చెప్పు జవాబు ప్రపంచమునకు జవాబు కాగలదు.**

**జవాబు :-** సందర్భమును బట్టి అడుగవలసిన ప్రశ్ననే అడిగావు. ఇప్పుడు చెప్పబోయే జ్ఞానమును కూడా బాగా అర్థము చేసుకోమని చెప్పుచున్నాను. సృష్ట్యాదిలో జరిగిన విధానము తెలుగు భాష పుట్టుకలో వచ్చినది. సృష్ట్యాదిలో మొదట పంచభూతములయిన ప్రకృతిని తయారు చేసినవాడు దేవుడే. అట్లే పంచభూతములతో పాటు దేవున్ని కూడా సృష్ఠించాడు. ఆ

దేవునికి గుర్తుగా ఓమ్ అను అక్షరమును శబ్దముతో తయారు చేశాడు. అట్లే పంచ భూతములయిన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమిని తయారు చేసి, వాటికి వేరు శబ్దములను సృష్టించి వేరు అక్షరములుగా దేవుడే చూపాడు. అయితే ప్రపంచమయిన పంచ భూతములను సృష్టించినవాడే వాటికి పెద్దయిన దేవున్ని సృష్టించాడు అని చెప్పాము. అంటే సృష్టింపబడిన వారు ఐదు మహా భూతములు మరియు వాటికి పెద్దయిన దేవుడు అని చెప్పడము జరిగినది. అయితే దేవున్ని మరియు పంచ మహా భూతములను తయారు చేసినవానిని ఏమనాలి? అతడు ఎవరు? అతని పేరు ఏమి? అతని ఆకారము ఎట్లున్నది? అతని పని ఏమి? అని ప్రశ్నించుకొని చూస్తే దానికి జవాబు ఈ విధముగా కలదు.

దేవుడు మరియు జీవులు అను వారు సృష్టించబడినారు. అయితే సృష్టించిన సృష్టికర్త ఎవరు? అనగా ఆయనకు పేరు లేదు, ఆకారము అంతకూ లేదు. ఏ పనీ చేయనివాడు. దీనినిబట్టి రూప, నామ, క్రియలు లేనివాడు అని చెప్పవచ్చును. ఆయనే ఐదు ముఖ్యమైన జీవుళ్ళను, వారికి దేవుడయిన వానిని సృష్టించాడు. ఆయనకు పేరు లేదు కావున అతనిని సృష్టికర్త అని అంటాము. అయితే పని చేయనివాడు అని అన్నారు కదా! సృష్టి అనే పనిని ఎలా చేశాడు అని కొందరు అడుగవచ్చును. దానికి జవాబు ఏమనగా! ప్రపంచము లేకముందు ఆయన ఆ పనిని చేశాడు. తర్వాత జీవరాసులు, ప్రపంచము, వాటికి దేవుడు అన్నీ వచ్చిన తర్వాత సృష్టికర్తయిన ఆయన ఒక్క పనిని కూడా చేయలేదు. అందువలన ఆయనను పనిలేనివాడు యని చెప్ప వచ్చును. మనకు దేవుడయిన వానిని సృష్టించిన వానిని ఏమని పిలువాలి అంటే దానికి ఒక మార్గము ఉంది. **ఎవరికీ తెలియబడనివానిని, వెతకబడే వానిని అనగా దేవులాడబడే వానిని దేవుడు**

**అని అనవచ్చును.** ముందు పంచభూతములతోపాటు పుట్టినవాడు కూడా తెలియబడేవాడు కాదు, కావున ఆయనను దేవుడు అని అంటున్నాము. ఈ లెక్కప్రకారము మనకు ఇద్దరు దేవుళ్ళు అవుతారు. ఒక దేవుడు సృష్ఠించాడు, ఇంకొక దేవుడు సృష్ఠించబడినాడు అని తెలియుచున్నది.

సృష్ఠించబడిన దేవుడు, సృష్ఠించిన దేవుడు ఇద్దరిలో సృష్ఠించిన వాడు పెద్దయని, సృష్ఠింపబడినవాడు చిన్నయని తెలియుచున్నది. సృష్ఠింప బడినవానికి సృష్ఠించినవాడు తండ్రియగును. అందువలన **సృష్ఠింప బడినవానిని కుమారుడుయనీ, సృష్ఠించినవానిని తండ్రియనీ ఇంజీలు గ్రంథములో పేర్కొన్నారు. ప్రథమ దైవ గ్రంథమయిన భగవద్గీత (తౌరాతు) లో చూస్తే సృష్ఠింపబడిన దేవున్ని ఆత్మయనీ, సృష్ఠించిన దేవున్ని పరమాత్మ యనీ అన్నాడు.** పరమాత్మయనునది పేరు కాదు. ఆత్మకంటే వేరుగా, (ఆత్మకంటే పరముగా) యున్నది పరమాత్మయని తెలియునట్లు చెప్పారు. ఆత్మ అను దేవున్ని సృష్ఠించిన తర్వాత పరమాత్మ అను ఆయన ఏ పనినీ చేయలేదు. చేయవలసిన పనులన్నిటినీ తన కుమారుడైన ఆత్మకే అప్ప జెప్పాడు. అప్పటి నుండి ఆత్మే అన్ని కార్యములను చేయుచున్నది. పరమాత్మ ఏమీ చేయక సాక్షిగా చూస్తూయున్నాడు.

అప్పటి నుండి పరమాత్మ తండ్రి అప్పజెప్పిన పనులు కుమారుడైన ఆత్మ చేస్తూ వస్తున్నాడు. ప్రపంచములో నిత్యము పుట్టు జీవరాసులను ఆత్మే పుట్టించుచున్నది. ఆత్మే పోషిస్తున్నది. చివరకు ఆత్మే చంపుచున్నది. అలా చనిపోయినవానిని పాపపుణ్యములను లెక్కవేసి, వానిని వాని కర్మప్రకారము ఆత్మే పుట్టించుచున్నది. ఏ జీవుడు ఏ జన్మకు పోవాలను నిర్ణయము (తీర్పు) చేసి ఆత్మే పంపుచున్నది. ఈ విధముగా పరమాత్మ చేయవలసిన పనులన్నిటినీ ఆత్మే చేయుచున్నది. అట్లే ఆత్మ సర్వ

జీవరాసులకు దేవుడుగా యున్నది. జీవరాసులకు సృష్టికర్త అయినవాడు ఆత్మే కావున ఆత్మ అందరికీ దేవుడుగా యున్నాడు. ఆత్మగా యుండి నిన్ను పుట్టించువానిని, పోషించువానిని, మరణింప చేయువానిని దేవునిగా అందరూ ఆరాధించవలెను. అతడు ఒక్కడే మనుషులకు ఆరాధ్య దైవము. అందువలన వేరే దేవున్ని ఆరాధించకూడదనీ అంతిమ దైవ గ్రంథము ఖుర్‌ఆన్‌లో కూడా చెప్పియున్నారు. ఇదే విషయమునే ద్వితీయ దైవ గ్రంథము యోహాన్ సువార్త ఐదవ అధ్యాయమునందు 19 నుండి 27వ వాక్యము వరకు చూడుము.

**(19) తండ్రి ఏది చేయుట కుమారుడు చూచునో, అదేకాని తనంతట తాను ఏదీ చేయనేరడు. ఆయన వేటిని చేయునో వాటినే కుమారుడును అలాగే చేయును.**

**(20) తండ్రి కుమారున్ని ప్రేమించుచూ, తాను చేయు కార్యములనెల్లను ఆయనకు అగపరచుచున్నాడని మీతో నిశ్చయముగా చెప్పుచున్నాను. మరియు మీరు ఆశ్చర్యపడు నట్లు వీటికంటే గొప్ప కార్యములను ఆయనకు అగపరచును.**

**(21) తండ్రి మృతులను ఏలాగు లేపి బ్రతికించునో అలాగే కుమారుడును తనకు ఇష్టము వచ్చిన వారిని బ్రతికించును.**

**(22) తండ్రి ఎవనికి తీర్పు తీర్చడుగానీ, తీర్పు తీర్చుటకు సర్వాధికారము కుమారునికి అప్పగించి యున్నాడు.**

**(23) తండ్రిని ఘనపరచునట్లుగా అందరును కుమారుని**

ఘనపరచవలెనని, కుమారుని ఘనపరచనివాడు ఆయనను పంపిన తండ్రిని ఘనపరచడు.

(24) నా మాట విని నన్ను పంపినవాని యందు విశ్వాస ముంచువాడు నిత్య జీవముగలవాడు. వాడు తీర్పులోనికి రాక మరణములో నుండి జీవములోనికి దాటి యున్నాడని మీతో నిశ్చయముగా చెప్పుచున్నాను.

(25) మృతులు దేవుని కుమారుని శబ్దము విను గడియ వచ్చుచున్నది. ఇప్పడే వచ్చియున్నది, దానిని వినువారు జీవింతురని మీతో నిశ్చయముగా చెప్పుచున్నాను.

(26) తండ్రి ఏలాగు తనంతట తానే జీవము గలవాడై యున్నాడో, అలాగే కుమారుడును తనంతట తానే జీవము గలవాడై యుండుటకు కుమారునికి అధికారము అనుగ్రహించెను.

(27) మరియు ఆయన మనుష్య కుమారుడు గనుక తీర్పు తీర్చుటకు (తండ్రి) అధికారము అనుగ్రహించెను.

ఆధ్యాత్మిక జ్ఞానమునకు అనుసంధానము చేసి, ఆధ్యాత్మికవేత్తల చేత తెలుగు భాష చెప్పబడినది. అందువలన మొదట ప్రథమాక్షరమును తర్వాత పంచభూతముల అక్షరములను దేవుడు సృష్టించాడని తెలియునట్లు తెలుగు భాష మొదటిలో **ఓమ్ న, మ, శి, వా, య** అని వ్రాసుకొనెడి

వారము. ఈ మధ్య కాలములో చరిత్ర తెలియని మనుషులు వచ్చి, తెలుగు భాషలోయున్న మొదటి ఆరు అక్షరములను తీసివేసి అచ్చులు, హల్లులు అను అక్షరముల నుండి అనగా అ ఆ ల నుండి చెప్పుచున్నారు. అందువలన నేడు ప్రజలలో ఆధ్యాత్మికమే లేకుండా పోయినది. మొదటి అక్షరముల జ్ఞానమే లేకుండా పోయినది.

తెలుగు భాషను తయారు చేయడములో ఆధ్యాత్మికవేత్తలు ప్రకటించిన అక్షర జ్ఞానము ప్రకారము, అనగా ఓమ్ నమశివాయ అను దాని ప్రకారము దేవుడయిన ఆత్మ, మహా జీవులయిన ప్రకృతి భాగములు ఐదు పుట్టినవని తెలిసినది. తర్వాత మిగతా అక్షరములు అన్నీ తయారయినవి. పరమాత్మయను పేరులేని దేవుడు, ఆత్మ అను దేవున్ని మరియు జీవరూపమైన ప్రకృతి భాగములను తయారు చేసి, అప్పటి నుండి తాను ఏమీ పని చేయక క్రియారహితుడుగా ఉండిపోయాడు. దీనినిబట్టి చూస్తే సృష్ఠి ఆదిలోని కొంత రహస్యము తెలియడమేకాక, ఓమ్ నమ శివాయ ఒక భాగముగా యుండి తర్వాత అచ్చులు, హల్లులు అనునవి తయారయినవి. అచ్చులు అనగా అ, ఆ, ఇ, ఈ నుండి అం, అః వరకు ఉండునవి. తర్వాత హల్లులు క, ఖ నుండి మొదలై య, ర, ల, వ నుండి ళ, క్ష, ఱ వరకు ఉండును.

తెలుగు భాషను మూడు రకములుగా విభజించి మన తత్త్వవేత్త లయిన వారు చెప్పారు. మొదట చెప్పిన ప్రథమ అక్షరము ఆత్మయిన దేవుడుకాగా, మిగతా న, మ, శి, వా, య ప్రకృతి శక్తులుగా యున్నవి. ఆత్మ, ప్రకృతి రెండూ ఉన్నత స్థానములో యున్నట్లు ఈ ఆరు అక్షరములు మొదట వ్రాసి తర్వాత అచ్చులు అనేవాటిని వ్రాస్తారు. అచ్చులు మొత్తము

18 గలవు.  ఈ అచ్చులు 18 కాగా, 1+8 కలిపితే 9 అవుతున్నది. 1+8=9 దీనినిబట్టి రెండవ వరుసలో యున్న 18 అక్షరములు సంపూర్ణ జ్ఞానులుగా యున్న జీవరాసులకు గుర్తుగా యున్నది.  వాటి మొత్తము తొమ్మిది అయినదానివలన  జ్ఞానము గల జీవుల గుంపుగా లెక్కించు చున్నాము.  తర్వాత వరుసలో క ఖ నుండి ప ఫ బ భ మ వరకు మొత్తము 27 అక్షరములు గలవు.  వీటి సంఖ్యను కూడా కలిపితే తొమ్మిదే వచ్చును. అందువలన  ఈ గుంపును భక్తి మార్గములో యున్నవారిగా చెప్పవచ్చును. తర్వాత నాల్గవ వరుసలో య ర ల వ నుండి ళ క్ష ఱ అను పదకొండు అక్షరములు గలవు.  ఈ గుంపు అక్షరములను పూర్తి అజ్ఞానులుగా, నాస్తికులుగా చెప్పవచ్చును.

ఈ విధముగా ఆధ్యాత్మికవేత్తలయినవారు పూర్వము తెలుగు అక్షరములను నాలుగు గుంపులుగా తయారు చేశారు.

**1) మొదటి గుంపు 1+5 ను ఒకటి ఆత్మయనీ, ఐదు మహా జీవులనీ చెప్పారు.**

**2) రెండవ గుంపు అచ్చులు 18. 1+8=9 వీటిని పూర్తి జ్ఞానులుగా చెప్పారు.**

**3) మూడవ గుంపు హల్లులు 27.  2+7 = 9 వీటిని భక్తులుగా చెప్పారు. (చ చే ఛ జ జే ఝ ఞ (చే జే) ఈ రెండు హల్లులు పూర్వము ఉండేటివి. ఇప్పుడు కాలగర్భములో కలిసిపోనవి.)**

**4) నాల్గవ గుంపులో 11. 1+1=2 వీటిని పూర్తి అజ్ఞానులుగా చెప్పారు.**

భూమిమీద పుట్టిన మనుషులలో జ్ఞానమును, అజ్ఞానమును సూచించుచూ 1) ఆత్మ జ్ఞానులు 2) భక్తులు 3) అజ్ఞానులుగా గుర్తుండు

నట్లు చేశారు. వాటన్నిటికీ పెద్ద దేవుడు, ప్రకృతియని తెలుపుచూ ప్రత్యేక భాగముగా 1+5 ఆరు అక్షరములను తయారు చేశారు. అందులో ఒకటి దేవుడయిన ఆత్మ. రెండవ గుంపు ప్రకృతియైన ఐదు మహా భూతములు అని చెప్పారు. ఈ విధముగా దేవుడు, ప్రకృతిని, మనుషలను తయారు చేయడమేకాక, మనుషలలో జ్ఞానులు, భక్తులు, అజ్ఞానులు అని మూడు రకములుగా ఉన్నారని తెలియునట్లు తెలుగు అక్షరములను తయారు చేసి చూపారు. ఈ విధానము ప్రపంచములో ఏ భాషలోను లేదు. ప్రపంచములో మొట్టమొదట పుట్టిన భాషగా తెలుగు భాష ఉండడమేకాక దైవ జ్ఞానముతో కూడుకొన్న ఏకైక భాషగా తెలుగుభాష ఉన్నదని చెప్పవచ్చును. ఈ మధ్య కాలములో చరిత్ర తెలియని కొందరు మేము పండితులమను అహము చేత ఎంతో అర్థముతో కూడుకొన్న అక్షరములలో కొన్నిటిని తొలగించి అర్థరహితము చేశారు.

ఏది ఏమయినా పూర్వము అక్షరములను తెలుగు భాషగా తయారు చేసి, తెలుగు భాష ఆధ్యాత్మిక భావముతో యున్నదని తెలియజేశారు. ఇంతవరకు మనము తెలుసుకొన్న భాషలో ఆత్మదేవున్ని, ఐదు ప్రకృతి భాగములను, సర్వజీవరాసులను పరమాత్మయను దేవుడు సృష్ఠించాడని తెలియుచున్నది. ప్రథమ దైవ గ్రంథమయిన తౌరాతులో అనగా భగవద్గీతలో ఆత్మ, పరమాత్మ, ప్రకృతి మూడు యున్నట్లు తెలియుచున్నది. భగవద్గీత జ్ఞానమే బైబిలులో యున్నది. అక్కడ చూచిన ప్రకారము పరమాత్మను వారు పరిశుద్ధాత్మయని చెప్పుచున్నారు. పరిశుద్ధాత్మకు ఆత్మ కుమారుడుగా యున్నాడని, కుమారుడైన ఆత్మ సర్వజీవరాసులను సృష్ఠించుచూ, మరణింప జేయుచూ, తీర్పుతీర్చి మరుజన్మకు పంపుచున్నదనీ, అటువంటి ఆత్మనే మనుషలు ఆరాధించవలెననీ పరమాత్మ అయిన దేవుడు చెప్పియున్నాడు.

దీనినిబట్టి మనకు (మనుషులకు) తండ్రి ఆత్మ యనియు, ఆత్మకు తండ్రి పరమాత్మ (పరిశుద్ధాత్మ) యనియు తెలియుచున్నది. ఈ విధముగా లెక్కించితే పరమాత్మ మనకు తాతగా యున్నాడనీ, తాతకు మనకు మధ్యలో తండ్రియైన ఆత్మ ఉన్నాడనీ, పరిశుద్ధాత్మయిన అనగా పరమాత్మయిన దేవుని వద్దకు (మోక్షమునకు) చేరాలంటే తండ్రి ద్వారానే పోవాలని తెలియు చున్నది. అందువలన పరమాత్మయిన దేవున్ని తెలియాలంటే ఆత్మయిన దేవున్ని తెలియవలసిందే. ఆత్మను తెలియడము లేక **ఆత్మను అధ్యాయనము చేయడమును ఆధ్యాత్మికము** అంటున్నాము. ఆధ్యాత్మికమును తెలియనిదే ఎవడుగానీ మోక్షమును చేరలేడు. ఏ జీవుడయినాగానీ మొదట ఆత్మను తెలియగలిగినప్పుడే తర్వాత పరమాత్మను తెలియవచ్చును. ఆత్మను తెలియుటకంటే ముందు ప్రకృతి వలన తయారయిన మాయను తెలియ వలసి యుంటుంది.

ప్రకృతి జనితమైన మాయను తెలియాలంటే ముందు తాను ఎవరో తెలియాలి. ఎందుకనగా! జీవుడే మోక్షమునకు పోవలసియున్నది. అందువలన జీవుడయిన తనవద్ద నుండి మొదలు పెట్టి గమ్యమయిన పరమాత్మ వద్దకు చేరవలసియుంటుంది. గమ్యము పరమాత్మ (మోక్షము) అయితే ప్రారంభ స్థలము జీవాత్మయని తెలియవలెను. ప్రారంభము నుండి మొదట తనను తాను (జీవాత్మను) తెలియవలెను, జీవాత్మ తర్వాత మాయను తెలియ వలెను, తర్వాత ఆత్మను తెలియాలి. ఆ తర్వాత పరమాత్మ తెలియబడును. దానినే మోక్షము అనియు, దానినే పరలోకము అనియు, దానినే ముక్తి అనియు అనేక విధముల చెప్పుచున్నారు. జీవుడు తన స్థలము నుండి ప్రారంభమయి జ్ఞానమార్గములో ప్రయాణించాలి. గమ్య స్థానము చివరిగా పరమాత్మకాగా, మధ్యలో దాటవలసిన ఊర్లు రెండు

గలవు. ఒకటి మాయ, రెండు ఆత్మ. ఈ రెండిటిని చూడగలిగి, ఈ రెండిటిని దాటగలిగితే అప్పుడు ముక్తి అయిన పరమాత్మను పొందవచ్చు. అలా పొందినప్పుడు ఆ జీవుడు తిరిగి పుట్టడు. ఆత్మ చేతిలో ఉన్నంతవరకు జన్మలు ఎత్తుచుండవలెను. అట్లే మాయను దాటనంతవరకు మనిషికి కష్టసుఖములు తప్పవు. ఎప్పుడయితే మనిషి శరీరములో యున్న జీవాత్మ మాయను దాటి ఆత్మను అర్థము చేసుకొని, ఆత్మను దాటి ముందుకు పోతే ముక్తి దొరుకుతుంది. అదే చివరి గమ్యమవుతుంది.

ఈ విధానమంతయు తెలియుటకు తెలుగు భాషలో ఒక గుంపుగా యున్న ఆరు (6) అక్షరములను, అట్లే రెండవ గుంపులో యున్న పదునెనిమిది (18) అక్షరములను, మూడవగుంపుగా యున్న ఇరువది ఏడు (27) అక్షరములను, చివరి నాల్గవగుంపుగా యున్న పదకొండు (11) అక్షరములను తెలియవలసి యున్నది. అలా తెలిసినప్పుడే తెలుగు భాష తెలియును. తెలుగు భాష మనిషికి జ్ఞాన సందేశముగా యున్నది. తెలుగు భాష మనిషిని ఆలోచింపజేసి, ముక్తి మార్గములో ముందుకు పోవుటకు అవకాశమును ఇచ్చుచున్నది. అయితే మనిషి తెలుగు భాషను నేర్చినప్పటికీ దానిలో ఇమిడియున్న ఆధ్యాత్మిక భావమును తెలియలేకున్నాడు. అందువలన భాషలో ఇమిడియున్న కొన్ని పదములు మిమ్ములను జ్ఞానమార్గములో నడిపించి, మూడు ఆత్మలను గురించి తెలియజేయును. మూడవ ఆత్మయిన పరమాత్మ అంతుచిక్కనిది, ఎవరికీ తెలియనిది అని సూచించునట్లున్న పదములను ఇప్పుడు చూస్తాము.

మనిషికి దగ్గరగా కొందరే యుంటారు. వారిని కుటుంబ సభ్యులు అంటాము. మనిషితో ఎక్కువగా సంబంధ బాంధవ్యములను కల్గియున్న వారు కొందరుంటారు. వారిలో కొందరిని చెప్పుకొంటే మగవారిలో

నలుగురిని, ఆడవారిలో నలుగురిని చూపుచూ వారిని ఇట్లు చెప్పారు. అమ్మ అను పదము అందరికీ తెలిసినదే. అమ్మలేని మనిషి భూమిమీద ఉండడు. చిన్నవయస్సులో శిశువుగా యున్నప్పుడు మొదట చెప్పు పదము అనగా బాలుని నోటికి వచ్చు మొదటి భాషా పదము అమ్మ, లేకపోతే అత్త. అమ్మ అనిగానీ, అత్త అనిగానీ చిన్నవయస్సులో పదములలో ఎంతో జ్ఞానము ఇమిడి యున్నది. దాని వివరము చూస్తే ఇలా కలదు.

అమ్మ, అత్త, అక్క, అవ్వ ఈ నాలుగు పదములు మొదట మనిషి చేత ఉచ్ఛరింపజేయుచున్నారు. కొంత పెద్దయిన తర్వాత అన్న, అప్ప, అయ్య, అబ్బ అను పదములను నేర్చి చెప్పుచున్నాము. ఈ ఎనిమిది పదములు మనిషి సులభముగా పలుకు పలుకులుగా యున్నవి. ఇందులో అనగా ఈ పదములలో గమనించితే మొదట అన్ని పదములకు **"అ"** అను అక్షరము సాధారణముగా యున్నది. తర్వాత రెండవ అక్షరమును చూస్తే అమ్మలో **మ** అను అక్షరమునకు **మ** వత్తు ఉండడము విశేషము. అట్లే రెండవ అక్షరముగా యున్న అమ్మ, అక్క, అవ్వ, అత్తలో ఏ దానికది దాని వత్తులే చెప్పబడి యున్నాయి. స్త్రీలకు చెప్పిన అమ్మ, అత్త, అక్క, అవ్వలో అలాగే ఉండడమేకాక, పురుషులకు చెప్పిన అన్న, అయ్య, అప్ప, అబ్బలో కూడా అట్లే ఉన్నాయి. భాషను తయారు చేసిన ఆధ్యాత్మికవేత్తలు అలా ఎందుకు తయారు చేశారు అనగా! మనుషులు ఈ పదాలను గురించి ఆలోచిస్తే దాని మూలముగా కొంత ఆత్మల జ్ఞానము తెలియునని వారి ఉద్దేశ్యమై యున్నది. వారి ఉద్దేశ్యమును తెలియుటకు ముందు ఒక పదమును తీసుకొని చూస్తాము.

**అమ్మ** అను శబ్దములో ఉన్న మొదటి అక్షరము అయిన **అ** యొక్క అర్థము లేదు, కాదు అని గలదు. బద్ధము అనగా సక్రమమైనది, సత్యమైనది

అని తెలియుచున్నది. అటువంటి **బద్ధము** అను పదమునకు **అ** ను చేర్చితే బద్ధము కానిది **అబద్ధము** అని తెలియుచున్నది. సత్యమునకు **అ** ను చేర్చితే అది అసత్యముగా మారిపోవుచున్నది. విశ్వాసము అనగా నమ్మకము అని అందరికి తెలుసు. ఆ పదమునకు **అ** అను శబ్దమును చేర్చితే అది కాస్తా అవిశ్వాసము అయిపోవును. నమ్మకము లేదు అన్నట్లు అగును. వివేకము అనగా తెలివి అని అర్థము గలదు. దానికి **అ** ను చేర్చితే అవివేకము అగును. అప్పుడు తెలివిలేదు అని అర్థము వచ్చుచున్నది. ఇట్లు ఎన్నో పదముల ముందర **అ** ను ఉపయోగించి, ఆ పదమునకు వ్యతిరేఖ భావమును వచ్చునట్లు చేయుచున్నారు. కొన్ని పదములను చూస్తే ఇలా కలవు. **వ్యక్తము** అనగా తెలియునది లేక కనిపించునది అని అర్థము కలదు అయితే దానికి **అ** ను చేర్చితే **అవ్యక్తము** అగుచున్నది. అప్పుడు తెలియనిది, కనిపించనిది అని వ్యతిరేఖ భావము వచ్చుచున్నది. అట్లే **శ్రద్ధకు అశ్రద్ధ** అనియు, **జ్ఞానమునకు అజ్ఞానమనియు, ద్వైతమునకు అద్వైతమనియు, మృతము** అనుటకు **అమృతము** అనియు, **నిశ్చయమునకు అనిశ్చయము** అనియు, **సంశయమునకు అసంశయము** అనియు **క్షరము నకు అక్షరము** అనియు, **ప్రతిష్టకు అప్రతిష్ట** అనియు, **ఏకమునకు అనేకము** అనియు చెప్పడము వలన వాటికి పూర్తి వ్యతిరేఖ భావము వచ్చుచున్నది.

ఇటువంటి శక్తిగల అనగా అర్థముగల **“అ”** అను అక్షరమును చేర్చి ప్రక్కన అమ్మయనీ, అత్తయనీ, అవ్వయనీ, అక్కయనీ చెప్పడములో అర్థమును చూస్తే ఇలా కలదు. ఇంతవరకు **అ** అను శబ్దమునకు ఎంత భావమున్నదో తెలిసిపోయినది. ఇప్పుడు **మ** అను అక్షరమునకు **మ వత్తే** యుండడము వలన ఒక అక్షరములో రెండు అక్షరములు కలిసియున్నట్లు తెలియుచున్నది. అట్లే **క్క, వ్వ, త్తా** అను అక్షరములు కూడా రెండు

అక్షరములు కలిసియున్న యుక్తాక్షరములుగా యున్నవి. ఇందులో ఏ అక్షరమున్నా అదే అక్షరముగా దాని వత్తే ఉండడములో విశేష అర్థము కలదు. అన్య అనుటలో **న** కు వేరే **య** వత్తు కలిసినది. ఇక్కడ అట్లుకాక వ్వ కు వ వత్తే, క్క కు క వత్తే, త్త కు త వత్తే ఉండడము వలన ఆనాటి ఆధ్యాత్మికవేత్తలు ఎందుకు అలా ఉంచారని ఆలోచిస్తే దానికి సమాధానము ఈ విధముగా దొరుకుచున్నది.

మనిషి శరీరములో దేవుడయిన ఆత్మ కలదు. ఆత్మే శరీరము అంతయూ ఆక్రమించుకొని శరీరములో మొదటి ఆత్మగా కనిపించుచున్నది. ఆత్మ చేత పుట్టినది జీవాత్మ. జీవాత్మ శరీరములో ఒకచోట కదలక మెదలక యున్నది. ఆత్మ చాటున యున్న జీవాత్మను చిన్న ఆత్మ అనియు, ఆత్మకు పుట్టినదనియు చెప్పుచున్నాము. అట్లే ఇప్పుడు రెండు శబ్దములు కలిసియున్న **మ్మ** ను తీసుకొని చూస్తే **మ** మొదటి ఆత్మగా యుండగా, జీవాత్మ కూడా శరీరములో రెండవ ఆత్మగా, ఆత్మ వెనుకయున్నది. అందువలన ఇప్పుడు అమ్మలో **మ** ను ఆత్మగా చెప్పితే, జీవాత్మను **మ వత్తుగా** చెప్పవచ్చును. మ కు మకార వత్తే యుండుట వలన మ ఆత్మకాగా, మకార వత్తు జీవాత్మగా రెండు ఆత్మలను సంయుక్తాక్షరముగా యున్న మ్మ గానీ, వ్వ గానీ, త్త గానీ, క్క గానీ తెలియజేయుచున్నవి. ఈ విధముగా సూచన చేయు యుక్తాక్షరము ముందర **అ** ఉండుట వలన ఆత్మ, జీవాత్మ రెండూ కాదు **నేను ముఖ్యము** అని చెప్పినట్లు కలదు. వాస్తవముగా శరీరములో ఆత్మ, జీవాత్మలు రెండూ యున్నా, సర్వకార్యములను ఆత్మే చేయుచున్నా, అవి కాదు నేను ఉన్నాను అన్నట్లు తెలియజేయు పరమాత్మగా **అ** అను శబ్దమును పోల్చుకోవాలి. అప్పుడు మనిషి శరీరములో మూడు ఆత్మలు ఉన్నట్లు తెలియుచున్నది. మూడు ఆత్మలను తెలియడమే త్రైతము అంటాము. అందువలన అమ్మ అను పదములో

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| **అ** | - | **పరమాత్మ** | **అ** | - | **పరమాత్మ** | **అ** | - | **పరమాత్మ** |
| **మ** | - | **ఆత్మ** | **త** | - | **ఆత్మ** | **వ** | - | **ఆత్మ** |
| **్మ** | - | **జీవాత్మ** | **్త** | - | **జీవాత్మ** | **్వ** | - | **జీవాత్మ** |

ఈ విధముగా ఒక పదములో మూడు అక్షర శబ్దములున్నట్లు, ఒక శరీరములో మూడు ఆత్మలున్నట్లు చెప్పవచ్చును. స్త్రీలయందుగానీ, పురుషులయందు గానీ శరీరములలో ఇదే విధముగా మూడు ఆత్మలున్న వని తెలియునట్లు అమ్మ, అక్క, అత్త, అవ్వ అని స్త్రీలను చెప్పియున్నారు. అట్లే అన్న, అప్ప, అయ్య, అబ్బ యని పురుషులను కూడా చెప్పియున్నారు. దీనినిబట్టి తెలుగు భాషా పదములలో మనము నిత్యము పలుకు పదములలో ఇంత జ్ఞానమును తెలియునట్లు మన పెద్దలు తెలుగు భాషను తయారు చేశారు.

తెలుగు భాష తర్వాత ఎన్నో భాషలు తయారయినాయి. అయినా వాటిలో భావమును తెలియు పదములే గలవు గానీ, ఆత్మ జ్ఞానమును తెలియు సారాంశము లేదు. ఈ విధముగా తెలుగు గడ్డలో పుట్టి, తెలుగు నేర్చినవారు కొంత ఆలోచిస్తే ఈ భాషలో ఇమిడియున్న జ్ఞానము తెలియగలదు. అందువలన తెలుగు భాషను దైవభాషగా నేను ముందే చెప్పియున్నాను. మొదట ఆధ్యాత్మికవేత్తలయిన వారు తెలుగు భాషను ఆత్మజ్ఞానముతో ఇమిడ్చి చెప్పిన ఘనత వారికే దక్కినది. నేడు తెలుగు రాష్ట్రములు రెండు ఉండగా, అందులో తెలుగు నేర్చినవారు 90 శాతమున్నారు. ఈ 90 శాతము మందిలో ఒక్కశాతమువారు కూడా తెలుగు భాష గొప్పతనమును తెలియలేకపోయారు. ఇప్పుడు ఉన్న కొన్ని కోట్ల తెలుగువారిలో ఒక ముస్లీమ్ తెలుగు భాషను ఎంతగానో ప్రేమిస్తూ,

దానిని గురించి గొప్పగా మాట్లాడడము చూచాను. లౌకికముగా తెలుగు భాషను పొగడుచున్న వ్యక్తి హిందువులలో కనిపించకున్నా ముస్లీమ్‌లలో కనిపించడము ఆశ్చర్యకర విషయము. అటువంటివారు తొందరలో తెలుగు భాష దైవజ్ఞాన భాషయని తెలియగలరు.

సజీవమైన శరీరములో పరమాత్మ, ఆత్మ, జీవాత్మ మూడు ఉన్నాయను భావమును అమ్మ పదములో చూపారు. మనిషికి తాను జీవుడని కూడా తెలియని పరిస్థితిలో యున్నాడు. తన పేరే తనకు తెలియక యున్న జీవునికి ఆత్మను గురించి, తర్వాత పరమాత్మను గురించి ఏమాత్రము తెలియదు. అందువలన మూడు దైవ గ్రంథములలో ఈ మూడు ఆత్మలను గురించి ప్రత్యేకమైన విధానముగా చెప్పియున్నారు. ముందు ప్రథమ దైవ గ్రంథమయిన తౌరాతులో (భగవద్గీతలో) చూస్తాము.

**పురుషోత్తమ ప్రాప్తి యోగములో 16వ శ్లోకము :**

ద్వావిమౌ పురుషౌ లోకే
క్షర శ్చాక్షర ఏవచ ।
క్షర స్సర్వాణి భూతాని
కూటస్థో క్షర ఉచ్యతే ॥

**పురుషోత్తమ ప్రాప్తి యోగములో 17వ శ్లోకము :**

ఉత్తమః పురుష స్త్వన్యః
పరమాత్మే త్యుదాహృతః ।
యో లోకత్రయ మావిశ్య
బిభర్త్యవ్యయ ఈశ్వర ః ॥

అని రెండు శ్లోకములలో మూడు ఆత్మల విధానమును గురించి వ్యాసుడు పేరు పెట్టిన **భగవద్గీత**లో, స్వయముగా భగవంతుడయిన కృష్ణుడు పేరు పెట్టిన **తౌరాతు**లో చెప్పడమైనది. మొదటి శ్లోకములో **భూమిమీద రెండు రకముల పురుషులు ఉన్నారనీ, అందులో ఒకరి పేరు క్షరుడు అని (నాశనమగువాడు యని) చెప్పుచున్నాము. క్షరుడు సర్వజీవరాసులలో ఉన్నాడు. అక్షరుడు (నాశనము కానివాడు) నాశనమయ్యే జీవునితో సహా కూడియున్నాడు.**

ఒక శరీరములో నాశనము చెందు జీవాత్మయుండగా, అదే శరీరములోనే నాశనము కాని ఆత్మ కూడా జీవాత్మతో కలిసి నివాసము చేయుచున్నాడు. అయితే జీవాత్మకు, ఆత్మకు మించి ఉత్తముడయిన మరొక పురుషుడు గలడు, అతనినే పరమాత్మయని అంటున్నాము. ఈ మూడవ పురుషుడే శరీరము లోపల, శరీరము బయట మొత్తము ముల్లోకములు అవహించి, అధిపతియని చెప్పబడుచున్నాడు. ఈ మూడవ పురుషున్నే కొందరు **పురుషులలో ఉత్తమమైన వాడు కావున పురుషోత్తమ** అని అన్నారు. అంతేకాక **ఆత్మకంటే వేరుగా యున్నవాడు కనుక ఆయనను పరమాత్మ** అని అన్నారు. పర అనగా వేరుగాయున్న అని అర్థము. ఆ అర్థము ప్రకారము పర+ఆత్మ= పరమాత్మగా చెప్పుచున్నారు. ఈ విధముగా ముగ్గురు పురుషులు శరీరములో యున్నారు. అయితే శాశ్వితముగా జీవాత్మ, ఆత్మ ఇద్దరూ శరీరములోనే ఉండగా, పరమాత్మ మాత్రము శరీరము లోపల, శరీరము బయట ఉన్నాడు. శరీరము బయట అణువణువున వ్యాపించి యున్నాడు, ఆయన లేని స్థలమంటూ లేదు. పరమాత్మ ఆ విధముగా విశ్వమంతా వ్యాపించి యుండగా, ఆత్మ శరీరము లోపల శరీరమంతా వ్యాపించి శరీర బయటి అంచువరకు నిండుకొని యున్నది. ఆత్మ శరీరమంతా యుండగా, జీవాత్మ శరీరములో తలయందు తల మధ్యలోగల

నాల్గుచక్రములలో క్రింది చక్రములో యున్నాడు. క్రింది చక్రము మూడు భాగములుగా యున్నది. తామస, రాజస, సాత్త్విక అను మూడు భాగము లలో ఏదో ఒక భాగమున ఒక్కచోట రవ్వంతగా జీవుడు యున్నాడు. ఈ వివరము భగవద్గీతలో చెప్పియుండగా,

ద్వితీయ దైవగ్రంథమయిన ఇంజీలు (బైబిలు)లో ఈ మూడు ఆత్మల విషయమును చెప్పియున్నారు. బైబిలులో మత్తయి సువార్త 28వ అధ్యాయములో 19వ వాక్యములో ఇలా కలదు చూడండి.

**మత్తయి. 28-19. "మీరు వెళ్ళి సమస్త జనులను శిష్యులుగా చేయుడి. తండ్రి యొక్కయు, కుమారుని యొక్కయు, పరిశు ద్ధాత్మ యొక్కయు నామములోనికి వారికి బాప్తిస్మమిచ్చుచూ పొమ్ము అని కలదు.**

తర్వాత అంతిమ దైవగ్రంథమయిన ఖుర్‌ఆన్‌లో సూరా 50లో ఆయత్ 21 నందు ఇదే మూడు ఆత్మల విషయము చెప్పబడియున్నది. అయితే ముస్లీమ్‌లు అక్కడ చెప్పిన జ్ఞానమును తమ బుద్ధి చేత గ్రహించు కోలేక పోయారు. ఖుర్‌ఆన్‌లో చెప్పిన విషయమును చూస్తే 3వ సూరా 18వ ఆయత్‌లోను, 16వ సూరా 51వ ఆయత్‌లోను మూడు ఆత్మల విషయము కలదు. అయితే దానిని ఏమాత్రము ఇంతవరకు గుర్తించినవారు లేరు అని చెప్పవచ్చును. ఇప్పుడు ఖుర్‌ఆన్‌లో చెప్పిన ఆయత్‌ను చూస్తాము.

50వ సూరా 21వ ఆయత్‌లో :- **"ప్రతి ఆత్మ (ప్రాణి) ఒక తోలేవాడితో, మరొక సాక్షమిచ్చే వాడితో సహా వస్తుంది."**

మరొక గ్రంథము అంతిమ దైవగ్రంథము ఖుర్‌ఆన్‌లో ఇలా వ్రాశారు చూడండి.

50వ సూరా 21వ ఆయత్‌లో :- **"ప్రతి వ్యక్తి తనవెంట తనను తీసుకొచ్చేవాడొకడు, సాక్షమిచ్చేవాడొకడు ఉన్న స్థితిలో హాజరవ్వుతాడు."**

ఈ విధముగా జీవాత్మ, ఆత్మ, పరమాత్మలను గురించి మూడు గ్రంథములలో వ్రాశారు.

**ప్రశ్న :- భగవద్గీత పుట్టి 5160 సంవత్సరములు, బైబిలు పుట్టి దాదాపు 2010 సంవత్సరములు, చివరి గ్రంథము ఖుర్‌ఆన్ పుట్టి దాదాపు 1400 సంవత్సరములు అయినది కదా! ఈ మూడు దైవ గ్రంథములలో జీవాత్మ, ఆత్మ, పరమాత్మ యను మూడు ఆత్మలను చెప్పినప్పుడు భగవద్గీతను చదివిన హిందువులు గానీ, బైబిలును చదివిన క్రైస్థవులుగానీ, ఖుర్‌ఆన్ గ్రంథమును చదివిన ముస్లీమ్‌లుగానీ ఒక్కరు కాకపోతే ఒక్కరు ఈ మూడు ఆత్మల విషయమును గ్రంథములలో ఎందుకు గ్రహించలేక పోయారు? ఇప్పుడు మీరు చెప్పునంత వరకు ఈ విషయము బయట తెలియకపోవడానికి కారణమేమిటి? ఐదువేల సంవత్సరముల నుండి తెలియని మూడు ఆత్మల విషయము ప్రత్యేకించి మీకు ఎందుకు తెలిసినది?**

**జవాబు :-** ఐదువేల సంవత్సరముల నుండి ఎక్కడా దాచిపెట్టకుండా మూడు దైవ గ్రంథములలోను మూడు ఆత్మలను గురించి చెప్పియున్నారు. అయినప్పటికీ ఇటు హిందువులుగానీ, అటు క్రైస్థవులుగానీ, మిగతా ముస్లీమ్‌లు గానీ ఈ విషయమును గ్రహించలేకపోయారు. ఒక

విషయమును వినినా, లేక చదివినా అది కొందరికి తక్కువ శాతము, కొందరికి ఎక్కువ శాతము అర్థమవడము జరుగుతాయున్నది. ఒక్కొక్కరికి ఒక్కొక్క శాతములో అర్థము అవుచుండును. అయితే మూడు ఆత్మల విషయము మూడు మతములవారిలో చదివినవారికి ఎవరికీ కనీసము ఒక్కశాతము కూడా అర్థము కాలేదని చెప్పవచ్చును. అందువలన ఇంత వరకు ఏ మతములోగానీ మూడు ఆత్మల విషయమే ప్రస్తావనకు రాలేదు. అట్లు అర్థము కాకపోవడమేకాక దానికి వ్యతిరేఖముగా అర్థమయిన సందర్భములు కూడా కలవు. ఎందుకు ఆ విధముగా జరిగినదో తెలియడము లేదు. ఇంతమందికి అర్థము కాని విషయము నాకు ప్రత్యేకించి అర్థము కావడము నాకే విచిత్రముగా తోచుచున్నది. ఆధ్యాత్మిక రంగములో అద్వైతమును బోధించినవారున్నారు. అట్లే ద్వైతమును, విశిష్టాద్వైతమును బోధించినవారున్నారు. వారు ఆయా సిద్ధాంతకర్తలుగా యున్నారు. మొదటి సిద్ధాంతకర్తయిన ఆది శంకరాచార్యుల వారు హిందువులలోని వాడే. అట్లే ద్వైత సిద్ధాంతకర్త మధ్వాచార్యులవారు కూడా హిందువులలోని వాడే. విశిష్టాద్వైత సిద్ధాంతకర్త కూడా హిందువే కావడము విశేషము. ఈ ముగ్గురికీ హిందువులకు సంబంధించిన భగవద్గీతలో గల క్షర, అక్షర, పురుషోత్తముల విషయము ఎందుకు అర్థము కాలేదో?

గీత తర్వాత మూడువేల సంవత్సరములకు వచ్చిన బైబిలులో కొందరు త్రిత్వము అని గుర్తించి చెప్పారుగానీ, అది కూడా పూర్తి అర్థము కాని విషయమైపోయి పూర్తి ప్రచారము కాలేదు. ఇకపోతే ముస్లీమ్‌లు తమ గ్రంథమును చదివినా, దేవుడు మూడు ఆత్మలుగా విభజింపబడి యున్నాడను విషయము తెలియలేకపోయారు. అంతేకాక దేవుడు ఒక్కడే యను నినాదమును వారు పైకి తెచ్చారు. క్రైస్థవులు త్రిత్వము అని చెప్పినా

వారిలో ఎవరు దేవుడు, ఎవరు జీవుడు అని తెలియలేకపోయారు. హిందువులయితే కొందరు మాత్రము జీవుడు, దేవుడు అను రెండు విషయములను చెప్పుచున్నారు. మూడవ వానిని పూర్తి మరచిపోయారు. మధ్యలోయున్న ఆత్మ విషయము హిందువులు గుర్తించలేకపోయారు. హిందువులు పూర్తి ఆధ్యాత్మికమును వదలి దేవతల పూజలలో పడిపోయారు. ఇట్లు మూడు మతముల వారు వారి గ్రంథములలోని త్రైత సిద్ధాంతముగా యున్న మూడు ఆత్మలను తెలియలేకపోయారు.

దేవుడు అనుకుంటే ఏమయినా జరుగుతుంది యన్నట్లు నేను పండితున్ని కాకపోయినా, సామాన్య మనిషిగా యున్నా, మా వంశములో ఎవరూ ఆధ్యాత్మికముతో సంబంధము లేకున్నా, నన్ను మాత్రము ఆధ్యాత్మికములోనికి దేవుడే తెచ్చి ఎవరికీ అర్థముకాని జ్ఞానమును నాకు అర్థమగునట్లు చేసి, చివరకు త్రైతముగా యున్న మూడు ఆత్మలను మూడు గ్రంథములలో యున్నట్లు గుర్తింప చేసి, హిందుమతములో అద్వైత, విశిష్టా ద్వైత, ద్వైత సిద్ధాంతకర్తల ప్రక్కన నన్ను త్రైత సిద్ధాంతకర్తగా నిలబెట్టడము నాకే పెద్ద విచిత్రముగా తోచుచున్నది. దేవుడు అనుకుంటే ఏదయినా చేయగలడు అను మాట నా యెడల నెరవేరిందని నాకు తెలిసింది. నేడు నేను ఏ జ్ఞానమునయినా త్రైత సిద్ధాంతముతో జోడించి చెప్పుచున్నాను. అందువలన మూడు దైవ గ్రంథములలోని జ్ఞానము నాకు సులభముగా అర్థమయినది. మూడు మతములలోని జ్ఞానము మొదటి నుండి త్రైతమయిన మూడు ఆత్మలతో కూడుకొని యుండుట వలన త్రైతము తెలియనివారికి అర్థము కాలేదు. త్రైత సిద్ధాంతకర్తనయిన నాకు మూడు గ్రంథముల జ్ఞానము సులభముగా అర్థమయినది.

**ప్రశ్న :- మీరు సృష్ఠి రహస్యమును చెప్పుచూ మూడు ఆత్మల**

**చేతనే ప్రపంచము తయారయినదని చెప్పుచూ, కొంతవరకు ఆత్మ, జీవాత్మ, పరమాత్మల విషయమును వివరించారు. కొందరు మీ మాటను లెక్కచేయక త్రిమూర్తులయిన విష్ణు, ఈశ్వర, బ్రహ్మ వలన ప్రపంచము ఏర్పడినదని, వీరు ముగ్గురు తనకు తానుగా పుట్టిన స్వయంభులని చెప్పుచున్నారు. ముగ్గురు మూర్తుల చేత ప్రపంచము సృష్ఠింపబడగా, మీరు మాత్రము ముగ్గురు మూర్తులయిన విష్ణు, ఈశ్వర, బ్రహ్మలతో సంబంధము లేకుండా మూడు ఆత్మల సృష్ఠి ప్రపంచము అనడము అసత్యము అంటున్నారు. పుట్టించువాడు బ్రహ్మ, పోషించువాడు విష్ణువు, మరణము కలుగజేయువాడు హరుడు లేక శివుడు అని అంటారని, వీరి ముగ్గురి వలన పుట్టడము, జీవించడము, మరణించడము జరుగుతూయున్నదని చెప్పుచున్నారు. అయితే ఈ ముగ్గురిని ఎవరూ పుట్టించలేదని వారకు వారుగా పుట్టిన స్వయంభువులని అంటున్నారు. దీనిని గురించి మీరు ఏమంటారు?**

**జవాబు :-** ఉన్న సత్యము ఒకటయితే మరొకరకముగా అనుకోవడము పూర్వము నుండి ఉన్న విషయమే. ఆధ్యాత్మికము అను పేరుతోనే కొందరు జ్ఞానమును బోధించుచున్నా వారు దారితప్పి ఇతర దారిలో బోధించు చుందురు. దైవమార్గములు రెండు రకములుగా యున్నవి. ఒకటి స్వచ్ఛమయిన సత్యమైన మార్గముకాగా, రెండవది స్వచ్ఛతలేనిది అసత్య మైనదిగా యుండును. స్వచ్ఛమయిన సత్యమైన మార్గము శాస్త్రబద్ధముగా

యుండును. ఆత్మలతో కూడియుండును. రెండవ మార్గము శాస్త్రబద్ధము కానిదిగా యుంటూ దేవతల భక్తితో కూడుకొనియుండును. మొదటి సత్యమైన మార్గము బ్రహ్మవిద్యతో కూడినదై, మూడు ఆత్మలతో కలిసి యుండును. రెండవ మార్గము వేదముల, పురాణములతో కూడినదై దేవతలతో కలిసియుండును. ప్రపంచములో రెండవ మార్గమయిన దేవతల మార్గములో పోవువారు 99 శాతము ఉండగా, బ్రహ్మవిద్యా శాస్త్రమును అనుసరిస్తూ ఆత్మల మార్గములో పోవువారు ఒక శాతము కూడా అరుదుగా ఉందురని చెప్పవచ్చును.

రెండవ మార్గములో పోవువారు త్రిమూర్తులయిన విష్ణు, ఈశ్వర, బ్రహ్మలే పెద్ద దేవతలనీ, వారి ద్వారానే సృష్ఠి అంతా ఉందని చెప్పుచుందురు. ఇదంతా పురాణములలో, వేదములలో ఉండే విషయమే. ముందు విష్ణువు తర్వాత ఈశ్వరుడు, ఆ తర్వాత బ్రహ్మ వారుకు వారుగా పుట్టారని అందువలన వారిని స్వయంభువులని అంటున్నామని చెప్పుచున్నారు. సరే ఇప్పుడు వారి మాటప్రకారమే పోతే వారే పెద్ద దేవుళ్ళని వారే ప్రపంచమును సృష్ఠించి, పాలించుచున్నారని చాలామంది చెప్పుచున్నారు. ఆ విధముగానే ఒప్పుకొన్నా వారే పెద్ద దేవుళ్ళు, వారి తర్వాత పెద్దవారు లేరు వారు ఎవరి చేత సృష్ఠింపబడలేదు అంటే నిజమని మనము ఒప్పుకొనినా ఈ మాటను విష్ణు, ఈశ్వర, బ్రహ్మలే ఒప్పుకొనేటట్లు లేరు. ఎందుకనగా! వారు నిత్యము దేవున్ని గురించి చింతచేయుచూ ముగ్గురు మూడు విధముల జపములు చేయుచున్నారు. శివుడు జపమాల చేతిలో పట్టుకొని దేవున్ని 108 మార్లు స్మరించుచున్నాడు. అట్లే బ్రహ్మ కూడా కమలములో కూర్చొని జపమాలతో ఆరాధించుచున్నాడు. త్రిమూర్తులలో పెద్దవాడయిన విష్ణువు కూడా ఒక ప్రక్కకు పడుకొని కళ్ళు మూసుకొని దేవున్నే ధ్యానించుచున్నాడు.

త్రిమూర్తులే దేవుళ్ళయినప్పుడు వాళ్ళు ఏ దేవున్ని ధ్యానించు చున్నారు? అని వారినే అడిగితే మమ్ములను సృష్ఠించిన దేవున్ని మేము ధ్యానించుచున్నాము. మాకు ఈ జన్మ నుండి తొలగించి మోక్షమును చేర్చమని ప్రార్థిస్తున్నాము అని అంటున్నారు. అటువంటప్పుడు మనము స్వయంభువులనుకోవడము పొరపాటు కాదా! శరీరముతో ఎవడున్నా వాడు తల్లిగర్భము నుండే పుట్టాలి. వాని శరీరములో మూడు ఆత్మలుండాలి. శరీరముతోయున్న ఎవడయినా గానీ వాడు జీవుడుగా కర్మలు అనుభవించు చుండగా అతనిని ఆత్మ నడుపుచుండును. ఇట్లు ఆత్మ, జీవాత్మ పని చేయని సజీవ శరీరములు భూమిమీద ఎక్కడా వుండవు. శరీరములో కనిపించని జీవాత్మ యుండగా, కనిపించని ఆత్మ ఆ జీవున్ని ఆదేశించి నడుపుచున్నది. అట్లు నడచు జీవుడు వాని శరీరములో కర్మబద్ధుడై యున్నాడు. అందువలన వేమన యోగి **శరీరముతో పుట్టిన బ్రహ్మ కర్మ వ్రాత ఎట్లు వ్రాయును?** అన్నాడు. అతనికి కూడా కర్మ వ్రాతను అమలు చేయు ఆత్మ యున్నాడు. ముగ్గురు మూర్తులకు కూడా జననము ఉన్నట్లే మరణము కూడా కలదు. అందువలన వారు దేవుళ్ళు అనుటకు వీలులేదు. అట్లే వారు స్వయముగా పుట్టినవారు కారు. శరీరములో ఒకడు పుట్టాడు అంటే వానికి కర్మ ఉంటేనే ఆత్మ చేత పుట్టించబడుచున్నాడు. అందువలన బ్రహ్మ ఇతరులను పుట్టించలేదు. అట్లే విష్ణువు ఇతరులను పోషించలేదు. శివుడు ఎవరినీ చంపలేదు. ఇవి వారి పనులు కావు. మనుషులు తెలియని అజ్ఞానముతో విష్ణు, ఈశ్వర, బ్రహ్మను పెద్ద దేవుళ్ళుగా భావించుకొంటున్నారు. అందరినీ పుట్టించువాడు, పోషించువాడు, మరణింపజేయువాడు ఆత్మయేనని తెలియవలెను.

## ప్రశ్న :- ఈ ప్రపంచమును సృష్టించినవాడు ఎవరు?

**జవాబు :-** మొట్టమొదట ఈ ప్రపంచమును సృష్టించినవాడు పరమాత్మ. ప్రకృతి ఐదు భాగములను మరియు ఆత్మను సృష్టించినవాడు ఒకే ఒక పరమాత్మయని చెప్పవచ్చును. ఎప్పుడయితే ప్రకృతి పుట్టిందో అప్పుడే ఆత్మ పుట్టింది. ఎప్పుడయితే ఆత్మ పుట్టిందో అప్పుడే కనిపించే ప్రపంచము పుట్టినది. అప్పుడు ప్రపంచమంతా యుండినా అది జీవులు లేకుండా ఉండేది. అందువలన పరమాత్మ జీవరాసులుగల సృష్టిని సృష్టించలేదని తెలియుచున్నది. ప్రకృతిని ఆత్మను సృష్టించిన పరమాత్మ ప్రకృతిని ఉపయోగించుకొని శరీరములను తయారు చేసి, అందులో జీవాత్మలను నింపి సజీవమైన సృష్టిని తయారు చేయమని ఆత్మకు ఆదేశించగా, అప్పటి నుండి ఆత్మ శరీరముగల జీవరాసులను తయారు చేసింది. ఇట్లు మనుషులను పుట్టించినవాడు ఆత్మయని తెలిసిపోయింది. ఆత్మ శరీర సహితముగా జీవరాసులను మనుషులను పుట్టించుచూ, అంతటితో ఆగక వాటిని నిత్యము పోషించుచూ చివరికి ఏదో ఒకరోజు మరణము కలుగజేయు చున్నది. ఈ విధముగా మనిషి జీవితములనుగానీ, ఇతర జంతు జీవితములనుగానీ ఆత్మే క్షణక్షణము నడిపించుచున్నది. శరీరములో జీవుడు ఏమి చేయనివాడై యుండగా, ఆత్మనే వానిని కర్మప్రకారము నడుపుచున్నది. జీవాత్మ శరీరములో ఆత్మ చేత కల్గిన సుఖములను దుఃఖములను అనుభవించుచున్నాడు. ఆత్మ అన్నీ చేయుచుండగా, జీవాత్మ వచ్చిన అనుభవములను అనుభవించుచుండగా, పరమాత్మ అన్నిటినీ సాక్షిగా చూస్తుయున్నది. దీనినిబట్టి ప్రపంచమును తయారు చేసినవాడు పరమాత్మ కాగా, జీవరాసులను తయారు చేసినవాడు ఆత్మయని తెలియుచున్నది. ప్రపంచమును ఆత్మను సృష్టించినవాడు పరమాత్మ. అట్లు మొదట జీవరహిత

ప్రపంచము తయారుకాగా, తర్వాత ఆత్మచేత జీవముగల శరీరములు తయారుకాగా, మనుషులు జంతువులు, పక్షులు మొదలగునవన్నియు తయారైనవి.

**ప్రశ్న :- దీనినంతటిని గమనిస్తే పరమాత్మకంటే ఆత్మయే ఎక్కువగా చేసినట్లున్నది. ఇప్పుడు ఆత్మ, పరమాత్మలలో మనకు ఎవరు ముఖ్యులు అని చెప్పాలి?**

**జవాబు :-** ఆత్మ, పరమాత్మలలో మనుషులకు ఆత్మయే ముఖ్యము. ఆత్మ మనుషులను పుట్టించి, పోషించి, మరణింపజేయుచున్నది. తర్వాత జీవునకు క్రొత్త జన్మను కల్గించి, తిరిగి ప్రపంచములో మనుగడ సాగునట్లు చేయు చున్నది. అందువలన అన్ని విధముల పరమాత్మకంటే ఆత్మయే మనకు గొప్ప. దానివలన ఆత్మనే ఆరాధించవలెనని మూడు గ్రంథములలో చెప్పారు.

**ప్రశ్న :- ఆత్మ, పరమాత్మ ఇద్దరూ దేవుళ్ళే, ఇద్దరూ సృష్టికర్తలే అయితే ఆత్మను సృష్టించిన పరమాత్మ ఆత్మకు తండ్రియగును. మనలను సృష్టించిన ఆత్మ మనకు తండ్రియగును. ఆ లెక్క ప్రకారము పరమాత్మ మనకు తాత అవుతాడు. ఆరాధన విషయమై అడిగితే వారిలో ఎవరిని ఎక్కువ పూజించాలి? పరమాత్మకంటే ఆత్మయే అన్ని విధముల మనలను పోషించు చున్నది. మనకు పరమాత్మ ఏమి చేయలేదు. అందువలన ఆయనను ఎందుకు ఆరాధించాలి? అని ఒక ప్రక్క అనిపించినా మరొక ప్రక్క తండ్రియైన ఆత్మకు తండ్రి అయినందున మొదట ఆయనను పూజించి తర్వాత ఆత్మను పూజించినా ఫరవాలేదా? యని అడిగితే దానికి ఇలా జవాబు కలదు.**

**జవాబు :-** ఇది అడుగవలసిన ప్రశ్నయే. ఈ అనుమానము ఎవరికయినా రావచ్చును. అయితే దాని విషయము ఎవరో ఒకరు తేల్చి చెప్పాలి. అలా చెప్పకపోతే ఎవరి ఇష్టము వచ్చినట్లు వారు చేయగలరు. ఈ విషయమును గురించి బ్రహ్మవిద్యా శాస్త్రమే చెప్పాలి. అందువలన బ్రహ్మ విద్యా శాస్త్రములో ఒక భాగమయిన ఖుర్‌ఆన్‌లో 3వ సూరా 18వ ఆయత్‌లో ఇలా కలదు.

**3-18 : అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యదైవము లేడని స్వయముగా అల్లాహ్, ఆయన దూతలు, జ్ఞాన సంపన్నులు సాక్ష్యమిస్తున్నారు. ఆయన సమత్వము, సమతూకముతో ఈ విశ్వాన్ని నిలిపియుంచాడు. సర్వాధిక్యుడు, వివేచనాశీలి అయిన ఆయన తప్ప మరొకరు ఎవరూ ఆరాధనకు అర్హులు కారు.**

ఈ వాక్యము ముస్లీమ్‌లకే సరిగా అర్థము కాలేదు. ఒక్క దేవున్నే ఆరాధించాలి అనునదే వారి ఉద్దేశ్యమయినా దానికి వారి వద్ద వివరణ లేదు. అయితే ఈ ఆయత్‌లో చెప్పిన విషయము చూస్తే ఇద్దరు అల్లాహ్‌లలో ఎవరు ఆరాధనకు అర్హులు అన్నదియున్నా, ఇద్దరు దేవుళ్ళు అంటే వారు వినడము లేదు. ఆ వాక్యమును మనమే తప్పుగా చెప్పుచున్నామని, ఖుర్‌ఆన్ గ్రంథములో ఇద్దరు అల్లాహ్‌లు అనేమాట లేనేలేదు అని కొందరు అంటున్నారు. అయితే ఒక అల్లాహ్ ఇంకొక అల్లాహ్‌నే ఆరాధనకు అర్హుడని చెప్పుచున్నాడు. ఎవరు ఎవర్ని అర్హుడని చెప్పుచున్నాడనగా **'అల్లాహ్, అతని దూతలు'** అని వాక్యములో చెప్పియున్నారు. కాబట్టి సులభముగా అర్థమయిపోతుంది. దేవదూతలు శరీరములోని అల్లాహ్‌కు

(దేవునికి) లేరు. దేవదూతలు మొదటి దేవుడైనవానికి, ప్రపంచమంతా వ్యాపించియున్నవానికి మాత్రమే యున్నారు. అందువలన మొదటి దేవుడయిన పరమాత్మ తాను సృష్ఠించిన అల్లాహ్‌ను (ఆత్మను) ఆరాధనకు అర్హుడు అని చెప్పుచున్నాడు.

శరీరములో 25 భాగములు ఉండగా వాటికన్నిటికి అధిపతి (ఆత్మ) అయినందున **'సర్వాధిక్యుడు'** అని ఆయనకు పేరు వచ్చినది. అంతేకాక శరీరములో అన్ని భాగములలో సమానముగా వ్యాపించి, శరీర మంతటా సమతూకము కల్గినవాడు శరీరములోని ఆత్మే అయినందున ఆయనే అన్ని విధముల ఆరాధనకు అర్హుడు అని చెప్పియున్నాడు. ఈ ఆయత్‌లో ఇద్దరు అల్లాహ్‌లు ఉన్నట్లు ముస్లీమ్ లోకము గ్రహించలేక పోయినది. ఈ వాక్యములో కూడా మీకు ఆరాధ్యదైవము ఒక్కడేయని చెప్పారుగానీ, వేరే ఏమి చెప్పలేదు గదా! ఈ వాక్యము ప్రకారము ప్రజలకు ఒక్కడే దేవుడు, ఆ ఒక్క దేవున్నే ఆరాధించాలి అని చెప్పడము జరిగినది. ఈ వాక్యము ఎంతో జ్ఞానముతో కూడుకొన్నదయినా, ప్రజలు దీనిని అర్థము చేసుకోకపోవడము ప్రజలకు పెద్ద నష్టమే. దేవుడు చెప్పిన దానిని నమ్మకుండా మా మతపెద్దలు చెప్పినదే నమ్ముతామనుట పెద్ద అజ్ఞానమగును.

దేవుళ్ళు ఇద్దరు కలరని, అందులో మొదటివాడు నిర్జీవమైన ప్రపంచమును సృష్ఠించి, దానితో పాటు ఇప్పుడు మనకు దేవుడయిన వానిని కూడా సృష్ఠించాడు. అలా సృష్ఠింపబడిన దేవుడు (ఆత్మ) మొదటి దేవుడుకు (పరమాత్మ) కు కుమారుడు అని చెప్పవచ్చును. మొదటి దేవుడయిన పరమాత్మ తన కుమారుడైన రెండవ దేవుని చేత సజీవమైన ప్రపంచమును సృష్ఠించాడు. మొదటి దేవుడు పరమాత్మ జీవరాసిలేని విశ్వమును సృష్ఠించగా, సృష్ఠింపబడిన రెండవ దేవుడయిన ఆత్మ ప్రకృతిని ఉపయోగించు

కొని సమస్త జీవరాసులను తయారు చేసినాడు. ఈ విధముగా ఇద్దరు సృష్ఠికర్తలు ఉన్నారని చెప్పవచ్చును. సజీవమైన మనుషులను తయారు చేసినవాడే మనకు ఆరాధ్య దైవముయని, మొదటి దేవుడయిన పరమాత్మను ఎవరూ ఆరాధించకూడదని స్వయముగా పెద్ద అల్లాహ్ అనగా మొదటి అల్లాహ్ చెప్పిన విషయము 3వ సూరా, 18వ ఆయత్‌లో ఉన్నదానిని చూచాము. ఇదే విషయమునే అందరూ నమ్మునట్లు ప్రత్యేకమైన మొదటి అల్లాను నేనున్నానన్నట్లు నన్ను కాకుండా, నేను సృష్ఠించిన దేవున్నే మీరు ఆరాధించాలని అదే ఖుర్‌ఆన్ గ్రంథములో మరొకచోట సూరా 16, ఆయత్ 51లో ఇలా చెప్పియున్నారు చూడండి.

**16-51 : అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు "ఇద్దరు ఆరాధ్య దైవములను కల్పించుకోకండి. ఆరాధ్య దైవము ఆయన ఒక్కడే. కాబట్టి మీరంతా కేవలము నాకే భయపడండి" అని అన్నాడు.**

("దివ్య ఖుర్‌ఆన్ సందేశము" తెలుగులో అనే గ్రంథములో కూడా ఈ వాక్యమును ఇలా వ్రాశారు చూడండి.)

**16-51 : అల్లాహ్ ఇలా ఆజ్ఞాపించాడు "(ఓ మానవు లారా) ఇద్దరిని ఆరాధ్యదైవములుగా చేసుకోకండి. నిశ్చయముగా ఆరాధ్యదైవము ఆయన (అల్లాహ్) ఒక్కడే. కావున నాకే భీతిపరులై ఉండండి."**

ఈ ఆయత్ 3-18లో చెప్పిన ఆయత్‌కు బలమును చేకూర్చు చున్నది. ఇద్దరు దేవుళ్ళు ఉన్నారనుటకు ఈ ఆయత్ పెద్ద సాక్షముగా యున్నది. **"ఆయనను ఆరాధించండి, నాకు భయపడండి"** అని చెప్పడము

వలన చెప్పేవాడు పెద్ద దేవుడని సులభముగా అర్థము కాగలదు. ఇక్కడ కూడా ఒక ముస్లీమ్‌లకే కాక సమస్త మానవులకు ఆరాధ్యదైవము ఒక్కడే యని ఆయననే ఆరాధించవలెనని చెప్పుచూ మొదట ప్రపంచమును మరియు మీరు ఆరాధించు దేవున్ని సృష్ఠించిన నాకు భయపడండి అని చెప్పాడు. ఇందులో అర్థముకాని విషయము ఏమీ లేదు. మీ ఆరాధ్య దైవము ఒక్కడేగానీ ఇద్దరు కారు అని చెప్పాడు. ఇంకా లోతుగా ఆలోచిస్తే మనము మాటల సందర్భములో వీనికి భయము, భక్తి రెండూ లేవు అని అప్పుడప్పుడు ఇతరులను గూర్చి చెప్పుచుందుము. అందులో మొదటిది భయము అని చెప్పాము కదా! తర్వాత రెండవది భక్తి అని కూడా చెప్పాము. దీనినిబట్టి భయము అనేది మొదటి సృష్ఠికర్తయిన పెద్ద దేవుని మీద ఉండాలి. తాతయిన దేవున్ని ఆరాధించక ఆయనకు భయపడి ఉండడము మంచిది. రెండవ సృష్ఠికర్త అనగా సమస్త జీవరాసులను సృష్ఠించిన సృష్ఠికర్తయిన ఆత్మను ఒక్కడినే దేవునిగా ఆరాధించాలని చెప్పియున్నారు. ఈ ఆయత్‌లో ఇద్దరు దేవుళ్ళనీ నమ్మనివారకు నమ్మునట్లు చెప్పియున్నారు. దీనివలన మనుషులకు ఇద్దరు దేవుళ్ళున్నారని సాక్ష్యము దొరుకుచున్నది. అందులో సృష్ఠింపబడిన దేవుడు ఆరాధ్యమునకు అర్హుడని, ఆరాధ్య దైవమును సృష్ఠించిన మొదటి సృష్ఠికర్త పెద్ద దేవుడే అయినా, ఆయనను ఆరాధించకూడదని, ఆయన ఉన్నాడని తెలిసినందుకు గుర్తుగా ఆయన ఎడల భయము కల్గియుండడము మంచిదని తెలియుచున్నది. ఖుర్‌ఆన్ గ్రంథములో ఆరాధ్యదైవమైన అల్లాహ్‌ను చాలాచోట్ల చెప్పగా, ఆరాధ్య దైవము కాని మొదటి అల్లాహ్‌ను గురించి అక్కడక్కడ చెప్పారు. ఆయన ఏ పనినీ చేయడని, ఆయన అనుకుంటే అన్నీ అయిపోతాయని చెప్పినది పెద్ద అల్లాహ్‌ను గురించే. అంతేకాక 112వ సూరాలో గల నాలుగు ఆయత్‌లు మొదటి అల్లాహ్‌ను గురించి చెప్పినవేయని తెలియవలెను.

ఇద్దరు దేవుళ్ళను గురించి అంతిమ దైవగ్రంథములో 3-18, 16-51 లో చెప్పిన విషయమును చెప్పాము. మూడు దైవగ్రంథములలోనూ ఒకే జ్ఞానము ఒకే విషయము చెప్పియున్నా, వ్రాసిన పద్ధతి వేరువేరుగా యుండుట వలన రెండు గ్రంథములలో వ్రాసినది ఒక్కటేయని కొందరు గ్రహించలేకపోవుచున్నారు. కొంత లోతుగా అర్థము చేసుకొంటే అన్ని గ్రంథములలో చెప్పినది ఒకటే జ్ఞానమని తెలియగలదు. అంతిమ దైవ గ్రంథము ఖుర్ఆన్‌లో చెప్పిన విషయమే ద్వితీయ దైవగ్రంథము ఇంజీలు (బైబిలు)లో కూడా యోహాన్ సువార్తలో ఐదవ అధ్యాయమందు 23, 24 వాక్యములలో చెప్పియున్నారు. ఇప్పుడు ఆ వాక్యములను చూస్తాము.

**యోహాన్. 5-23 : తండ్రిని ఘనపరుచునట్లుగా అందరూ కుమారుని ఘనపరచవలెనని, తీర్పు తీర్చుటకు సర్వాధికారము కుమారునికి అప్పగించియున్నాడు. కుమారుని ఘనపరచని వాడు ఆయనను పంపిన తండ్రిని ఘనపరచడు.**

**యోహాన్. 5-24 : నా మాట విని నన్ను పంపిన వాని యందు విశ్వాసముంచువాడు నిత్యజీవనము గలవాడు. వాడు తీర్పులోనికి రాక మరణములో నుండి జీవములోనికి దాటి యున్నాడని మీతో నిశ్చయముగా చెప్పుచున్నాను.**

యోహాన్ సువార్తలోని రెండు వాక్యములు, ఖుర్ఆన్‌లోని రెండు వాక్యములకు సమానముగా యున్నవని కొంత బుద్ధిని ఉపయోగించి చూచిన వారికి అర్థము కాగలదు. 23వ వాక్యములో 'తండ్రియని' చెప్పియున్నారు కదా! మొదట ప్రకృతిని, ఆత్మను తయారు చేసిన సృష్టికర్తనే

ఇక్కడ తండ్రియని చెప్పియున్నారు. కుమారుడు అనగా పరమాత్మ చేత సృష్ఠింపబడిన ఆత్మనే కుమారుడు అని అనుచున్నారు. మొదటి సృష్ఠికర్తయిన పరమాత్మ లేక పరిశుద్ధాత్మ చేత తయారయిన కుమారుడగు ఆత్మను అందరూ ఆరాధించవలెనని చెప్పియున్నారు. పరమాత్మను ఆరాధించకుండ భక్తి భావములను ఆయన కుమారుడైన ఆత్మ మీద చూపవలెనని, ఆత్మనే ఆరాధించవలెనని అట్లు కుమారుడైన ఆత్మను ఆరాధిస్తే సృష్ఠికర్త అయిన పరమాత్మను ఆరాధించినట్లేయని, కుమారుడైన ఆత్మను ఆరాధించక పోతే పరమాత్మను ఆరాధించనట్లేయని చెప్పారు. దీని సారాంశమును చూస్తే **"మీరు నన్ను ఆరాధించకూడదు, నా కుమారున్నే ఆరాధించమని"** ఖుర్ఆన్‌లో చెప్పినట్లుగలదు. **"నా కుమారున్ని ఆరాధిస్తే నన్ను ఆరాధించినట్లే యని, నా మాట ప్రకారము నా కుమారున్ని ఆరాధించక పోతే నన్ను ఆరాధించనట్లేయని"** కూడా చెప్పారు. ఇక్కడ 23వ వాక్యములో చెప్పిన విషయమును చూస్తే ఖుర్ఆన్‌లో 3-18లో చెప్పిన సారాంశమే గలదు. **'మీకు ఒక్కడే ఆరాధ్యదైవము'** అని చెప్పినట్లు ఇక్కడ కూడా **'మీరు కుమారున్నే ఆరాధించండి, ఆయనే మీకు ఆరాధ్యదైవము'** అని చెప్పినట్లు గలదు.

బైబిలులో యోహాన్ 5-24లో గల వాక్యమును చూస్తే, ఖుర్ఆన్‌లో **"నేను కూడా ఉన్నాను నాకు భయపడి ఉండండి"** అన్నట్లు, **"నన్ను పంపిన వానియందు నమ్మకము ఉంచువాడు"** అని మొదటి సృష్ఠికర్త అయిన దేవున్ని గురించి చెప్పినట్లు గలదు. అలా మొదటి దేవుని మాట మీద విశ్వాసముంచి రెండవ దేవున్ని ఆరాధన చేయువాడు మరణించిన తర్వాత రెండవ జన్మకు తీర్పులోనికి రాకుండా నిత్య జీవమైన మోక్షమును పొందును అని చెప్పియున్నాడు. ఖుర్ఆన్‌లో ఇద్దరు దేవుళ్ళు ఉన్నారని చెప్పినట్లే ఈ

రెండు వాక్యములలో తండ్రి, కుమారుడు ఇద్దరు దేవుళ్ళున్నారని చెప్పి యున్నారు. పరమాత్మకు భయపడి ఆయన మాటప్రకారము ఆత్మను ఆరాధిస్తే వానికి మోక్షము కల్గునని కూడా చెప్పారు. మొదటి దేవున్ని నమ్మి రెండవ దేవున్ని ఆరాధించవలెనని రెండు గ్రంథములలో చెప్పి యున్నారు. ఖుర్ఆన్‌లో మొదటి దేవునికి భయపడండి అన్నారు. బైబిలులో ఆయన మీద విశ్వాసముంచండి అన్నారు. అట్లే మొదటి సృష్టికర్తను లేక పరిశుద్ధాత్మను తెలిసియుండి, ఆయన తయారు చేసిన దేవున్ని ఆరాధించమని చెప్పాడు. ఎటు తిరిగి ఇద్దరు దేవుళ్ళ ప్రస్తావన రెండు గ్రంథములలో వచ్చినది. కావున ఒక దేవుడు ఆరాధింపబడేవాడు. ఒక దేవుడు గుర్తు ఉండవలసిన వాడు. విశ్వమును సృష్టించిన పరమాత్మను నమ్మి ఆయన చెప్పిన జ్ఞానము ప్రకారము జీవరాసులను సృష్టిస్తూ, పోషిస్తూ, మరణింప జేయుచూ, తిరిగి పాపపుణ్యముల లెక్కలో తీర్పు తీర్చి తిరిగి పుట్టునట్లు చేయుచున్న ఆత్మను ఆరాధించవలెనని రెండు గ్రంథములలలోని నాలుగు వాక్యముల సారాంశము గలదు.

ఇదే విషయమే ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో కలదు. భగవద్గీతలోని జ్ఞానసారాంశమే మిగతా రెండు గ్రంథములలో ఉండుట వలన మూడు గ్రంథములలో ఇద్దరు దేవుళ్ళ విషయము ఉంది అని చెప్పవచ్చును. భగవద్గీతలో మొదటి సృష్టికర్తను పురుషోత్తముడు మరియు పరమాత్మయని చెప్పారు. రెండవ దేవున్ని ఆత్మయని చెప్పారు. పరమాత్మ ఆత్మ విషయములను అనేక శ్లోకములలో చెప్పియున్నారు. అయితే ఏ శ్లోకము ఏ ఆత్మకు అని చాలామందికి తెలియకపోవడము వలన, తర్వాత మొదటికే భగవద్గీత జ్ఞానము హిందువులకు అర్థము కాకపోవడము వలన, హిందువులు భగవద్గీతకంటే ముందునుండి అనేక దేవతలకు, దయ్యములకు,

చెట్లకు, పుట్లకు భక్తులుగా యుండి వాటినే ఆరాధించడము వలన దేవుళ్ళు ఇద్దరనిగానీ, అందులో ఒకే దేవున్ని ఆరాధించవలెననిగానీ తెలియకుండా పోయినది. బైబిలు, ఖుర్‌ఆన్ జ్ఞానమునకు మూలాధారము తౌరాత్ (భగవద్గీత) అయినా క్రైస్థవులకు ముస్లీమ్‌లకు అర్థమయినంత జ్ఞానము కూడా హిందువులకు అర్థము కాలేదు. వారు గ్రుడ్డిగా ఒకే దేవుడు అన్నట్లు కూడా చెప్పలేకపోవుచున్నారు.

నేను ఈ రోజు ప్రతిపాదించిన త్రైత సిద్ధాంతము సత్యమైనదని తెలియునట్లు త్రైత సిద్ధాంత సూత్రములు భగవద్గీతలోను, బైబిలులోను, ఖుర్‌ఆన్‌లోను గలవు. నాకంటే ముందు హిందూమతములో ముగ్గురు సిద్ధాంతకర్తలు వచ్చారు. మొదటివాడు ఆది శంకరాచార్యులవారు (కేరళ నివాసి), రెండవవాడు విశిష్టాద్వైతమును ప్రతిపాదించారు ఈయన తమిళ నాడు నివాసి. మొదట శంకరాచార్యుల వారు అద్వైతమును ప్రచారము చేయగా, తర్వాత రామానుజాచార్యుల వారు విశిష్టాద్వైతమును ప్రచారము చేశారు. తర్వాత కొంత కాలమునకు కర్నాటక నివాసి అయిన మధ్వాచార్యుల వారు ద్వైతమును ప్రతిపాదించి చెప్పారు. ఈ మూడు సిద్ధాంతములలో నేడు భూమిమీద అద్వైత, విశిష్టాద్వైతమే ఎక్కువగా యున్నది. ద్వైతము పేరుకు మాత్రమే కలదు. ప్రస్తుత కాలములో ఆంధ్ర రాష్ట్రములో నివశించు ప్రబోధానంద యోగీశ్వరులుగా యున్న నా చేత త్రైత సిద్ధాంతము ప్రతి పాదించబడినది. నా చేత చెప్పబడిన త్రైత సిద్ధాంతమునకు శాస్త్రాధారము గలదు. ముందు ప్రకటించబడిన మిగతా మూడు సిద్ధాంతములకు శాస్త్రాధారము లేదు.

బ్రహ్మవిద్యా శాస్త్రముగా యున్న ప్రథమ దైవగ్రంథము తౌరాతు (భగవద్గీత) లోను, ద్వితీయ దైవగ్రంథము ఇంజీలు బైబిలులోనూ, అంతిమ

దైవగ్రంథము ఖుర్ఆన్‌లోను మాచే చెప్పబడిన త్రైత సిద్ధాంతమునకు ఆధారములున్నవి.

## భగవద్గీత :

భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగమున గల **16, 17** శ్లోకములలో త్రైత సిద్ధాంతము కలదు.

**క్షరుడు - జీవాత్మ (ఆరాధించే వాడు) సృష్ఠింపబడిన వాడు**

**అక్షరుడు - ఆత్మ (ఆరాధ్య దైవము) రెండవ సృష్ఠికర్త**

**పురుషోత్తముడు - పరమాత్మ (పరిశుద్ధాత్మ) మొదటి సృష్ఠికర్త**

## బైబిలు :

బైబిలులో మత్తయి **28-19**వ వచనములో త్రైత సిద్ధాంతము కలదు.

**కుమారుడు - జీవాత్మ (ఆరాధించే వాడు) సృష్ఠింపబడిన వాడు**

**తండ్రి - ఆత్మ (ఆరాధ్య దైవము) రెండవ సృష్ఠికర్త**

**పరిశుద్ధాత్మ - పరమాత్మ (అల్లాహ్) మొదటి సృష్ఠికర్త**

## ఖుర్ఆన్ :

ఖుర్ఆన్‌లో **50**వ సూరా, **21**వ ఆయత్‌లో త్రైత సిద్ధాంతము కలదు.

**తోలబడేవాడు - జీవాత్మ (ఆరాధించే వాడు) సృష్ఠింపబడిన వాడు**

**తోలేవాడు - ఆత్మ (ఆరాధ్య దైవము) రెండవ సృష్ఠికర్త**

**సాక్షిగ ఉండేవాడు - పరమాత్మ (అల్లాహ్) మొదటి సృష్ఠికర్త**

ఈ విధముగా మూడు దైవగ్రంథములలో మూడుచోట్ల త్రైత సిద్ధాంతము చెప్పబడినది. అయినా త్రైత సిద్ధాంతమును గురించి హిందువులకు, క్రైస్థవులకు, ముస్లీమ్‌లకు తెలియకుండా పోయినది. ప్రజలకు తెలియని దైవ సిద్ధాంతమును నేడు నా ద్వారా దేవుడు బహిర్పరచాడు. నేడు **త్రైత సిద్ధాంతమును ప్రతిపాదించినవారు ప్రబోధానంద యోగీశ్వరులు** అను పేరు వచ్చినది. ఐదువేల సంవత్సరములప్పుడు త్రైత సిద్ధాంతము భగవద్గీత గ్రంథరూపములో యున్నా, ఈ త్రైత సిద్ధాంతమును సృష్టిఆదిలోనే దేవుడు చెప్పాడు. సృష్ఠిఆదిలో చెప్పిన అదే సిద్ధాంతమే మూడు దైవ గ్రంథములలో ఐదువేల సంవత్సరముల నుండి యున్నా, అది మనుషులలో తెలియకుండా పోయిన దానివలన నేడు శాస్త్రబద్ధముగా మా చేత చెప్పించబడినది. నేడు మేము త్రైత సిద్ధాంతమును చెప్పినా త్రైత సిద్ధాంతములో గల ముగ్గురు పురుషుల మాట 1400 సంవత్సరముల పూర్వమే ఖుర్‌ఆన్‌లో 5వ సూరా 73వ ఆయత్‌లో వ్రాయబడియున్నది చూడండి.

సూరా 5, ఆయత్ 73 : **అల్లాహ్ ముగ్గురిలో మూడవ వాడు అని అన్నవారు కూడా ముమ్మాటికీ తిరస్కారానికి పాల్పడినట్లే, వాస్తవానికి ఒక్కడైన అల్లాహ్ తప్ప మరో ఆరాధ్య దైవము లేనేలేడు. ఒకవేళ వారు తమ మాటలను మానుకోకపోతే వారిలో తిరస్కార వైఖరిపై ఉండేవారికి బాధాకరమైన శిక్ష తప్పక యుంటుంది.**

ఈ వాక్యము 1400 సంవత్సరములప్పుడు అంతిమ దైవగ్రంథము ఖుర్‌ఆన్‌లో వ్రాయబడి యున్నది. అంటే ముగ్గురు పురుషులున్నారని నేడు నేను చెప్పినమాట ఆనాడు వాక్యములో ఉందంటే నాకు కూడా సంతోషమే. అయితే ఇక్కడ దైవము వేరు, ఆరాధ్యదైవము వేరు అని

రెండు రకముల దేవుళ్ళు కలరు. జీవాత్మ, ఆత్మ, పరమాత్మ ముగ్గురి వరుసలో మూడవవాడు నిజమైన పెద్ద దేవుడు అయినా, ఆయన ఆరాధ్య దైవము కాదు అని చెప్పియున్నారు. మూడవవాడు నేను సృష్ఠికర్తనే అయినా మీకు రెండవ వాడయిన ఆత్మే ఆరాధ్యదైవము అని సూరా 3, ఆయత్ 18 లోను, సూరా 16, ఆయత్ 51లో చెప్పియున్నారు. నేను కూడా అదే విషయమునే చెప్పుతూ రెండవ ఆత్మే ఆరాధ్యదైవము అని చెప్పుచున్నాను. రెండవవాడు కాదు అని మూడవవాడు అని అంటే అతడు సత్యతిరస్కారుడు అని అన్నారు. అంటే సత్యమును ఒప్పుకోనివాడు అని అర్థము. త్రైత సిద్ధాంతమును తెలిసినవాడు దేవుడు మూడవవాడు అనినా, ఆరాధ్య దైవము రెండవవాడేయని చెప్పినట్లు మేము ముందే బోధించాము. నేడు త్రైత సిద్ధాంతమును మా ద్వారానే ఇతరులు తెలియుచున్నారు. కావున మూడవ ఆత్మయిన పరమాత్మను ఆరాధ్యదైవము అని ఎవరూ చెప్పరు. మనుషులను సృష్ఠించిన ఆత్మనే ఆరాధ్య దైవముగా చెప్పునట్లు మేము ముందే విశదీకరించి చెప్పాము. అందువలన త్రైత సిద్ధాంతములో ఆరాధ్యదైవము రెండవ దేవుడయిన ఆత్మేనని, త్రైతము తెలిసిన అందరికీ తెలుసు. అయితే త్రైత సిద్ధాంతము తెలియనివారు ఎందరో ఉన్నారు, వారు దేవుడు ఎవరు? ఆరాధ్య దైవము ఎవరు? అని తెలియకపోవడము వలన దేవుని శిక్ష వారికి తప్పదు.

**ప్రశ్న :- భగవద్గీత పురుషోత్తమ ప్రాప్తి యోగములో మీరు ముగ్గురు పురుషులు ఉన్నారని చెప్పుచున్నారు. అక్కడ 16వ శ్లోకములో క్షర, అక్షర అన్నప్పుడు క్షరము అనగా నాశనమయ్యేది శరీరము, అక్షరము అనగా నాశనము కానివాడు జీవాత్మయని అన్ని భగవద్గీతలలో వివరము వ్రాసియున్నారు. దాదాపు మూడు**

**వందల భగవద్గీతలలో ఎంతో పెద్ద స్వామీజీలు ఆ మాట వ్రాసియున్నప్పుడు మీరు మాత్రము క్షరుడు అంటే జీవుడు, అక్షరుడు అంటే ఆత్మయనీ క్రొత్త అర్థమును తెచ్చారు. ఎంతో పెద్ద హేమాహేమీలయిన స్వామీజీలు చెప్పినదానికి మీరు వ్యతిరేఖముగా ఎందుకు వ్రాశారు? అంతమంది చెప్పినది తప్పు, మీరు చెప్పినది ఒప్పు అగునా? క్షరము అనగా నాశనమయ్యే శరీరము అని అందరికీ తెలుసు కదా! దీనికి మీరు ఏమంటారు?**

జవాబు :- ***అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,***
***సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.***

అను సూత్రము ప్రకారము ఎంతోమంది స్వాములు చెప్పినది సత్యమని మీరు ఎందుకు అనుకోవాలి. వారంతా ముందు పుట్టినవారు, పెద్దవారు అంటే నేను వారికంటే ముందునుండి ఉన్నవాడిని అని మీరు ఎందుకు అనుకోకూడదు? నేను మొదటి నుండి హిందువులకు భగవద్గీత అర్థము కాలేదని చెప్పుచునే యున్నాను. ఇప్పుడు భగవద్గీతను అందులోని త్రైత సిద్ధాంతమును చిక్కు తీసినట్లు వివరముగా చెప్పుచున్నా అర్థము చేసుకోకుండా ఎవరో ఏమో చెప్పారని అంటున్నారు. ఈ విషయమును నన్ను అడగకుండా నేను చెప్పినది తప్పా, వారు చెప్పినది తప్పాయని మీరు భగవద్గీతలోనే వెదకి చూడవచ్చును కదా! ఎన్నో సంవత్సరముల నుండి ఎందరో పండితులు, స్వామీజీలు భగవద్గీతను వ్రాసి గొప్ప పేరు పొందినది నిజమే! అంతమాత్రమున వారు చెప్పినది సత్యము అనుకోవడము పెద్ద పొరపాటు. వారు సంస్కృత భాషలో పాండిత్యమును కల్గియుండ వచ్చును గానీ జ్ఞానమును తెలిసియుండరు కదా! భగవద్గీతలో **"ద్వావిమౌ**

**పురుషౌ"** అని అన్నప్పుడు ఇద్దరు పురుషులు అని అర్థము కదా! తర్వాత **"ఉత్తమః పురుష స్త్వన్యః"** అని చెప్పినప్పుడు ఉత్తమమైన పురుషుడు అన్యుడు మరొకడు కలడని అతనినే పరమాత్మ అని అంటున్నామని చెప్పాడు.

మొదటి శ్లోకములో ఇద్దరు పురుషులని చెప్పారు. రెండవ శ్లోకములో ఇద్దరికంటే ఉత్తమ పురుషుడు పరమాత్మయని చెప్పారు. అప్పుడు ముగ్గురు పురుషులగుచున్నారు కదా! మిగతా అన్ని భగవద్గీతలలో ముగ్గురు పురుషులని ఒప్పుకొని చెప్పుచున్నా మొదటి క్షర పురుషున్ని నాశనమయ్యే శరీరము అని చెప్పుచున్నారు. ఇదెట్లున్నదంటే ఒకాయన ఇతరులతో మాట్లాడుచూ "నాకు ముగ్గురు కొడుకులు, మొన్ననే ఒక కొడుకుకు పెళ్ళి చేశాను. అయినా వచ్చిన అల్లుడు మంచివాడు కాదు. ప్రతిరోజు సారాయి త్రాగి వచ్చి నా బిడ్డను కొట్టుతాడు" అన్నట్లున్నది. కొడుకులు ముగ్గురయితే అల్లుడు ఎక్కడి నుండి వచ్చాడు అని ప్రశ్న వేయకుండా మనము వింటే చెప్పేవానికంటే తెలివితక్కువవాడు వినేవాడు అవుతాడు. అదే విధముగా ముగ్గురు పురుషులయినప్పుడు నాశనమయ్యేవాడు ఒకడు, నాశనము కానివాడు మరొకడు అన్నప్పుడు, నాశనము అయ్యేవాడు అంటే రేపా, ఎల్లుండా, సంవత్సరమునకా లేక ప్రళయములోనా అని ఆలోచించక ఈ రోజే లేకుండా పోతాడు అనుకుంటే అది సత్యముకావచ్చు, కాకపోవచ్చు. అట్లే నాశనమయ్యేవాడు అన్నప్పుడు ఎప్పుడు అని ఆలోచించక, ఎట్లు అని ఆలోచించక నాశనమగునది శరీరము అన్నారు.

శరీరము ప్రకృతితో తయారగునది. ప్రకృతి స్త్రీతత్త్వము కలది. నాకు భార్యలాంటిది. సర్వ జీవరాసులకు తల్లి అని చెప్పినప్పుడు శరీరము ప్రకృతి అయిన స్త్రీ అని తెలిసినప్పుడు క్షర పురుషునిలోనికి స్త్రీ అయిన శరీరమును ఎందుకు చెప్పాలి అని ఎవరూ ఆలోచించకుండా పోయారు.

పురుషోత్తమ ప్రాప్తి యోగముకంటే ముందు గల గుణత్రయ విభాగ యోగములో మొదటి మూడు నాలుగు శ్లోకములలో ప్రకృతి జీవులకు తల్లిలాంటిదని చెప్పారు. అప్పుడు ప్రకృతితో తయారయిన శరీరమును స్త్రీగా పోల్చవచ్చును. స్త్రీ లింగమయిన శరీరమును పులింగమయిన క్షర పురుషుని స్థానములో చెప్పడము తప్పని, వింతగా యుండునని ఆలోచన చేయకుండా, ఎవరో పెద్దలని పేరు పెట్టుకొన్నవారు వ్రాస్తే, కొంతయినా ఆలోచించక అదే సత్యము, మీదే అసత్యమని ప్రశ్నించుట ఎట్లున్నదో మీరే ఆలోచించండి. క్షర పురుషుడు మోక్షము పొందినప్పుడు నాశనమయి పోయి పరమాత్మగా మారునను ఉద్దేశ్యముతో ఆ మాటను క్షరుడు అని చెప్పారుగానీ వేరే అర్థము తీసుకోకూడదు. శరీరములో నివశించువాడు క్షర పురుషుడైన జీవాత్మ, మరణములో శరీరము నాశనమగునుగానీ క్షర పురుషుడైన జీవాత్మ నాశనము కాదు. జీవాత్మ ఆత్మ చేత వేరే శరీరమును చేరుచున్నాడు. మరణములో శరీరము నాశనమవగా, మోక్షములో జీవాత్మ నాశనమగును. ఈ తారతమ్యము తెలియనివారు జీవాత్మను శరీరము అనడము తప్పు.

మూడు ఆత్మలను ముగ్గురు పురుషులుగా చెప్పారు. ఇద్దరు పురుషులు ఒక శరీరములో కొంత కాలముండి, తర్వాత జననములో క్రొత్త శరీరమును చేరి, మరణముతో పాత శరీరమును వదలివేయుచున్నారు. జీవాత్మ శరీరములో ఒకచోట ఉండగా, ఆత్మ శరీరమంతా వ్యాపించి శరీరమునకు అధిపతిగా యున్నది. అంతేకాక శరీరములోని ప్రతి పనిని ఆత్మే చేయుచున్నది. ఆత్మ చేయు ప్రతి పనిని పరమాత్మ చూస్తూయుండగా జీవాత్మ ఆ పనిలోని కష్టసుఖముల అనుభవములను అనుభవించుచున్నాడు. పరమాత్మ శరీరములో జీవాత్మ ఆత్మకు సాక్షిగాయుంటూ శరీరము బయట

అణువణువునా వ్యాపించియున్నది. అందువలన పరమాత్మను సర్వవ్యాపి, సర్వదర్శియని అంటున్నారు.

తెలుగు భాషతో మొదలయిన ఆత్మజ్ఞానము చివరకు ముగ్గురు పురుషుల వరకు ప్రాకినది. అయితే మనుషులు తెలుగు భాషను నేర్చు కొన్నారుగానీ అందులో నిక్షిప్తమైయున్న జ్ఞానమును తెలియలేకపోయారు. కొందరు తెలుగు భాషలో పండితులుగా పేరు పొందినా, వారికి కూడా ఆత్మ, పరమాత్మల విషయము తెలియకుండా పోయినది. తెలుగు భాష రెండు రకములుగా యున్నది. ఒకటి అంకెలుగా, రెండు సంఖ్యలుగా. తెలుగు అంకెలనే తెలుగు అక్షరములు అని చెప్పవచ్చును. తెలుగు అంకెల ద్వారా అనగా తెలుగు అక్షరముల ద్వారా ఆధ్యాత్మిక జ్ఞానమును తెలియ గలిగాము. అట్లే తెలుగు సంఖ్యల ద్వారా కూడా ఆధ్యాత్మిక జ్ఞానమును తెలియుటకు అవకాశముండునట్లు మన పెద్దలు సంఖ్యలను అమర్చి పెట్టారు. ఇంతవరకు తెలుగు భాషలోని అక్షర జ్ఞానమును సంపూర్ణముగా తెలియగలిగాము. ఇప్పుడు సంఖ్యల జ్ఞానమును కూడా ఎలా కలదో పరిశీలిద్దాము.

ఈ ప్రపంచము లేనప్పుడు కూడా దేవుడు ఉన్నాడు. ఇప్పుడూ ఉన్నాడు, అప్పుడూ యున్నాడు. అయితే ఆయన ఎట్లుండేది ఎవరికీ తెలియదు. ఆయన అన్నిటికీ అతీతుడు, దేనికీ తెలియువాడు కాడు. అటువంటి దేవుడు తన ఉనికిని బయటికి తెలియజేయాలనుకొన్నాడు. అప్పుడు ఆయన సంకల్పము జరుగుచూ వచ్చినది. ఎవరికీ తెలియని ఆది దేవుడు మొదట తననుండి ప్రకృతిని విడుదల చేయాలనుకొన్నాడు. తర్వాత తాను స్వయముగా మూడు భాగములుగా తెలియాలనుకొన్నాడు.

తర్వాత అట్లే ప్రకృతిని తయారు చేశాడు. తర్వాత వెంటనే మూడు ఆత్మలను తయారు చేశాడు. తెలియని దేవుని నుండి తెలిసే విధముగా నాలుగు భాగములు వచ్చినవి. ఆ నాలుగులో మూడు పురుషతత్త్వము మరియొకటి స్త్రీ తత్త్వముగా ఉండునట్లు చేశాడు. దీనినిబట్టి దేవుడు రెండు విధములుగా బయటికి తెలిసాడు అని చెప్పవచ్చును.

ఈ విధముగా తయారు కాకముందు తయారు అయ్యే వాటికి అనుగుణముగా కొన్ని గుర్తులు తయారైనవి. ఆ గుర్తులనే సంఖ్యలు అని అన్నాము. అట్లే మరియొక విధమైన గుర్తులు కూడా తయారైనవి. వాటిని అంకెలు అన్నారు. ఈ విధముగా దేవుడు వ్యక్తమగు జ్ఞానమును తెలియ జేయుటకు దేవుడు ఏర్పరచిన రెండు రకముల గుర్తులనే సంఖ్యలు, అంకెలు అన్నారు. భూమిమీద దేవుని జ్ఞానము సంఖ్యలు, అంకెల రూపములో తయారైనది. ఈ అంకెలు, సంఖ్యలు కలిపి బ్రహ్మవిద్యా శాస్త్రము అని అంటాము. సంఖ్యలు, అంకెల రూపములో తయారయినదే బ్రహ్మవిద్యా శాస్త్రము. ఈ బ్రహ్మవిద్యా శాస్త్రమును అనుసరించి దేవున్ని కనుగొనునట్లు, దేవున్ని తెలియునట్లు అవకాశమును కల్పించాడు. ఈ గ్రంథము మొదలులోనే మొదట తయారయిన అంకెలను చూపించి వాటిలో దైవ జ్ఞానము ఇమిడియున్నదని చెప్పాము. ఓం అనునది ప్రథమాక్షరము అంకెల రూపములో యున్న తెలుగు భాషగా యున్నది. ఇంతకుముందే **"లు"** అను పేరుతో ఒక గ్రంథమును ఇచ్చాము. అందులో తెలుగు అను పదములో 'లు' అను అక్షరము ఎంత విలువగా యున్నదో కూడా చెప్పాము. ఆ రోజు తెలుగు భాషగా గుర్తింపబడిన గుర్తులలో దైవజ్ఞానము ఇమిడి యున్నదని చెప్పుకొన్నాము.

అంకెల విధానములో ఓమ్, న, మ, శి, వా, య అను ఆరు అక్షరములు మొదట తయారైనవని చెప్పాము. ఏ విధముగా మొదట ఓమ్ దేవుని గుర్తుగా అంకెలతో తయారయినదో, అదే విధముగా సంఖ్యలలో మొదట ప్రకృతి గుర్తుగా ఒక చిహ్నము తయారైనది. అంకెలలో ఓమ్ దేవుని గుర్తుకాగా, సంఖ్యలలో మొదట ప్రకృతి గుర్తు తయారయినది. దీనినిబట్టి దేవుడు సంపూర్ణముగా తెలియాలి అంటే ప్రకృతిని తెలిసినప్పుడు అసలయిన దేవుడు తెలియబడును. అందువలన దేవుడు రెండు విధములుగా వ్యక్తము అయినాడు. అంకెల విధానములో భాష తయారు కాగా దాని పేరు తెలుగు భాషయని పేరు పెట్టుకొన్నాము. ఆ విధముగా తెలుగు అను పేరు పెట్టుకొనేదానికి ఎంతో అర్థము కలదని ఇంతకుముందే **"లు" "తెలుగు"** అను గ్రంథములో చెప్పుకొన్నాము. ఇప్పుడు రెండవ ప్రకృతి విధానములో అనగా ప్రకృతివైపు నుండి చూస్తే దేవుడు ఎట్లు తెలియునో, సంఖ్యల ద్వారా వివరించి తెలుసుకొందాము.

ఇదంతా ఎప్పుడో సృష్ఠి ఆదిలో జరిగింది అని మీరే అంటున్నారే, అప్పుడు జరిగిన విషయమును ఇప్పుడు మీరు ఎలా తెలియజేయగలరు. మీరు చెప్పినదంతా అభూతకల్పన కాదా!యని ఇతరులు నన్ను ప్రశ్నించుటకు అవకాశము గలదు. వాస్తవమే! ఎప్పుడో జరిగినది, ఎవరికీ తెలియనిది నీకెట్లు తెలియును మేమెందుకు నమ్మాలి అని ఇతరులు నన్ను అడగడములో న్యాయము గలదు. ఇదంతయు సృష్ఠ్యాదిలో జరిగినదే ఆనాడు నేను లేను నీవు లేవు, ఎవరూ లేరు. అటువంటి సమయములో జరిగిన విధానము నాకే కాదు ఎవరికీ తెలియుటకు అవకాశమే లేదు. నాకు ఏమాత్రము తెలియదని పూర్తిగా ఒప్పుకొంటున్నాను. అయినా నాకు తెలియని దానిని నేను చెప్పడము నాకు కూడా వింతగానేయున్నది. ఈ విషయమును నేను

నమ్మాలా లేదా అను సంశయము కూడా ఒకమారు వచ్చినది. అయినా ఇదంతయు పూర్తి సత్యమని నమ్ముచున్నాను. మిమ్ములను నమ్మమని నేను చెప్పడము లేదు. మొదట మీరు ఇది నమ్మదగిన విషయమా కాదా!యని ఆలోచించండి. మీ ఆలోచనలో నమ్మవచ్చు అని తెలిస్తే నమ్మండి లేకపోతే నమ్మవద్దండి. నేను బలవంతము చేసి మీరు నమ్మండని చెప్పడము లేదు.

ద్వితీయ దైవగ్రంథము ఇంజీలు (బైబిలు)లో మత్తయి సువార్త 10వ అధ్యాయమందు 20వ వచనములో ఈ విధముగా కలదు.

**మత్తయి.10-20 "మీ తండ్రి ఆత్మ మీలో యుండి మాటలాడు చున్నాడేగానీ మాటలాడువారు మీరు కాదు"**

అని యున్నది. ఈ వాక్యమునుబట్టి ఏ మనిషి స్వయముగా మాట్లాడడము లేదు అనీ, ఆత్మ పలికిస్తేనే పలుకుతున్నాడని తెలియుచున్నది. అట్లే అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్‌లో **"మీ శరీరములో నేను కార్యకర్తగా యున్నానని, అన్ని పనులు నేనే చేయు చున్నానని"** సూరా 2, ఆయత్ 255 లోను మరియు సూరా 6, ఆయత్ 102 లోను ఇంకను చాలాచోట్ల చెప్పియున్నారు. భగవద్గీతలో కూడా **"నీవు ఏమీ చేయడము లేదు, అన్నీ నేనే చేయు చున్నానని"** చెప్పియున్నాడు. దీనినిబట్టి నాకు తెలియని విషయము నాలోనుండి చెప్పబడినా అది నేను చెప్పునది కాదు అని నేను తెలుసుకో గల్గినాను. శరీరములోని దేవుడు చెప్పినది సత్యమేయని నేను పూర్తిగా నమ్ముచున్నాను. మీ విషయము నాకు తెలియదు.

ఆధ్యాత్మికమును అనగా ఆత్మ విధానమును తెలియుటకు కొంత ప్రకృతిని కూడా తెలియవలసియున్నది. ఆత్మ పురుషుడు అనుటకు స్త్రీ ఉన్నప్పుడే అలా చెప్పుటకు వీలగును. అందువలన స్త్రీ తత్త్వమైన ప్రకృతిని దేవుడు తయారు చేసి, పురుషతత్త్వమైన ఆత్మను తయారు చేశాడు. దేవుని నిర్ణయము ప్రకారము ప్రపంచము తయారైనది. ప్రపంచములో ఆత్మకు గుర్తుగా పురుషులు, ప్రకృతికి గుర్తుగా స్త్రీలు కనిపించుచున్నారు. ప్రకృతికి ఆత్మకు తయారైనవే జీవరాసులు అని చెప్పవచ్చును. అనగా స్త్రీ తత్త్వముతో మరియు పురుషతత్త్వముతో సర్వజీవరాసులు తయారైనవి. అదే నేడు కనిపించే జీవరూపమైన విశ్వము. స్త్రీలు ప్రకృతికి గుర్తుకాగా, పురుషులు ఆత్మకు గుర్తుకాగా ప్రకృతి పురుషుల వలన పుట్టిన జీవుల గుర్తుగా నపుంసకులను దేవుడు తయారు చేసియుంచాడు. తల్లి తండ్రికి పుట్టిన వ్యక్తిలో తల్లి పోలికలు కొన్ని, తండ్రి పోలికలు కొన్ని ఉండడము చూస్తున్నాము. అలాగే ప్రకృతి పురుషులకు పుట్టిన జీవునికి గుర్తుగా కొంత స్త్రీ, కొంత పురుష లక్షణములుగల నపుంసకున్ని దేవుడు చూపడము జరిగినది. నపుంసకుడు జీవునికి గుర్తుకాగా, స్త్రీ ప్రకృతికి గుర్తుకాగా, పురుషుడు ఆత్మకు గుర్తుగా యున్నాడు. ప్రకృతికంటే దేవుడయిన వాడే గొప్ప అని తెలియునట్లు స్త్రీ శరీరము బలములో తక్కువగాయుండగా, పురుష శరీరము బలములో, ఆకారములో కూడా పెద్దగా దృఢముగా ఉండును. స్త్రీల శరీరములు పురుషునికంటే ఆకారములో బలహీనముగా యుండును. ప్రకృతి పురుషులకు (ఆత్మకు) పుట్టిన నపుంసకుడు మధ్యరకముగా ఉండడము కూడా చూస్తున్నాము. ఇదంతా బయటికి కనిపించే విధానము. కనిపించని విధానమును సృష్టిఆదిలో జరిగిన మార్పును చూస్తే, అంకెల విధానము ఒక భాషగా ఏర్పడినది. అట్లే

భాషలో భాగముగా సంఖ్యల విధానము కూడా ఏర్పడినది. దానిని ఇప్పుడు తెలుసుకొందాము.

ఆదిలోని కనిపించని దేవుడు మొదట ప్రకృతి విధానమును చూపుచూ ఒకే గీత గుండ్రని వలయముగా యున్నట్లు చూపాడు. దాని ఆకారము క్రింది చిత్రముగా ఉన్నది.



ప్రకృతిని గుర్తుగా చూపుచూ ఒక వలయాకారమును దేవుడు తయారు చేశాడు. ఆ వలయము ఎటువైపు చూచినా ఐదు గీతలు ఉన్నట్లు తెలియుచున్నది. దీనినిబట్టి ప్రకృతి ఐదు భాగములుగా యున్నదని తెలియు చున్నది. ప్రకృతి ఐదు భాగములకు ఐదు వలయములు గలవని అర్థమగు చున్నది. తర్వాత ప్రకృతి నుండి అనగా స్త్రీ నుండే తయారు కావలెనని లేక పుట్టుచున్నవని తెలియునట్లు ఆ వలయములోని రెండు గుర్తుల రెండు రేఖలను తీసుకొని ఒక గుండ్రని ఆకారముగా తయారు చేశాడు. తర్వాత

రెండు గుర్తుల రేఖలను కలిపి గుండ్రని ఆకారమును తయారు చేశాడు. మిగిలిన ఒక గుండ్రని గుర్తును సగము గుండ్రని ఆకారముగా తయారు చేశాడు. రెండు గుండ్రని రేఖలను ఇలా ఒక గుండ్రని ఆకారముగా తయారు చేశాడు దానిని అర్థమగుటకు చిత్రరూపములో చూస్తాము.




ఈ విధముగా నాలుగు గుర్తుల రేఖలను, రెండు గుండ్రని ఆకారములుగా తయారు చేశాడు. స్త్రీ నుంచే పురుషుడు పుట్టుచున్నా డనుటకు గుర్తుగా ప్రకృతిగా చూపిన ఐదు వలయముల నుండి నాలుగు వలయములతో తయారయిన రెండు గుండ్రని భాగములను రెండు ఆత్మలుగా పోల్చి చెప్పాడు. తర్వాత మిగిలిన ఒక వలయమును తీసి సగము సున్నాగా చూపాడు. అది ఇలా కలదు.



ఈ విధముగా తయారయిన సగము సున్నాను రెండు సున్నాల ప్రక్కన యుంచాడు. అప్పుడు ఇలా కనిపిస్తావుంది.



ఈ విధముగా మూడు సంఖ్యలు తయారైనాయి. ఆ మూడు సంఖ్యలను కలిపి చూడగా అదియే శతముగా (వందగా) నూరుగా తయారైనది. సంఖ్యలలో ఒకటి దానిప్రక్కన రెండు సున్నాలను పెట్టితే నూరు లేక వంద అని అంటాము. అట్లే శతము అని కూడా అంటాము. అంకెలు బ్రహ్మవిద్యా శాస్త్రముగా తయారుకాగా, దానిలోని భాగముగా సంఖ్యాశాస్త్రము తయారైనది.



1) ఆకాశము 2) గాలి 3) అగ్ని 4) నీరు 5) భూమి. ఒకటవ నంబరు ఆకాశము పైన ఉండగా, దానిక్రింద రెండవ నంబరు గాలి కలదు. గాలి క్రింద మూడవ నంబర్ అగ్ని కలదు. దానిక్రింది నాల్గవ నంబరు నీరు కలదు. దానిక్రింద ఐదవ నంబర్ భూమి కలదు. క్రింద భూమి ఉండగా భూమిమీద నీరు చెరువుల రూపములో, నదుల రూపములో, సముద్రముల రూపములో ఉండడము చూస్తూనే ఉన్నాము. ఈ విధముగా ఒకదాని తర్వాత ఒకటి ఉండగా చివరిలో ఆకాశము గలదు. దీనినే ప్రకృతి గుర్తుగా దేవుడు వలయమును తయారు చేసి, ఆ వలయముల నుండి తీసుకొన్న గీతలతో ౧౦౦ ను తయారు చేసాడు.






ఈ విధముగా ప్రకృతి నుండి ముగ్గురు పురుషులు తయారైనట్లు సూచించారు. ఇక్కడ మూడు గుర్తులను ప్రక్క ప్రక్కగా వ్రాస్తే...



శతముగా కనిపించుచున్నది. అనగా జీవాత్మ, దానిప్రక్కన ఆత్మ, దాని ప్రక్కన పరమాత్మ యున్నట్లు తెలియుచున్నది. ఈ విధముగా శతము అను మూడు సంఖ్యల నుండి మూడు ఆత్మలను గుర్తించవచ్చును. రెండు సున్నాలు సంపూర్ణముగాయుండి ఆత్మ పరమాత్మగా యుండగా, సగము సున్న రెండు ఆత్మలకంటే తక్కువదన్నట్లు అదే జీవాత్మ అని తెలియునట్లు జ్ఞానులు సంఖ్యాశాస్త్రమును తయారు చేసి శతమును చూపారు. సంఖ్యా

శాస్త్రము బ్రహ్మవిద్యా శాస్త్రమునకు అనుబంధముగా యున్నది. సంఖ్యా శాస్త్రమునే నేడు గణిత శాస్త్రము అని కూడా అంటున్నాము. ఈ గణితములో జీవాత్మకు, ఆత్మకు, పరమాత్మకు గుర్తుగా యున్న సంఖ్యలు కూడా కలవు. వాటిని ఇంకొక పద్ధతిలో అర్థము చేసుకొందాము.

మూడు ఆత్మల సిద్ధాంతమే త్రైత సిద్ధాంతము. ఆ త్రైత సిద్ధాంతము నకు గుర్తుగా మూడు సంఖ్యల గుర్తును పెద్దలు నిర్ణయించడము జరిగినది. జీవాత్మగా యున్న మనము దేవుడుగా యున్న ఆత్మను, ఆత్మ దేవున్ని సృష్ఠించిన పరమాత్మను తెలియవలసియున్నది. అయినా వారు తెలియబడని వారుగా యున్నారు. తెలియబడనివారుగా యున్నందున వారిరువురినీ రెండు సున్నాలుగా చూపి, తెలియవలసిన జీవున్ని సగము సున్నాగా చూపడమైనది. ఈ విధముగా చూపిన మూడు సంఖ్యల గుర్తును మూడు అక్షరముల శతముగా చెప్పడమైనది. మూడు సంఖ్యలు మూడు ఆత్మలకు గుర్తులుగా చెప్పారు క్రింద చూడండి.




ఇట్లు మూడు గుర్తులను జీవాత్మ, ఆత్మ, పరమాత్మగా చూపడమే గాక పూర్తి వివరముగా సంఖ్యలలో ఇంతకుముందే 3, 6, 9 అని చెప్పి యున్నాము. 3, 6, 9 తెలుగు భాష కాదు ఇవి ఆంగ్ల భాష సంఖ్యలు. తెలుగు భాషలో 3, 6, 9 ప్రత్యేకముగా యుంటూ, ప్రత్యేకమైన జ్ఞానమును

బోధిస్తున్నవి. ఆంగ్ల భాషలో యున్న 3, 6, 9 సంఖ్యలను తెలుగులో వ్రాసుకొంటే **౩౬౯** అని కలదు. తెలుగు భాషలో సంఖ్యలను వ్రాసుకొంటే **౧౨౩౪౫౬౭౮౯౧౦** అని వ్రాయువచ్చును. ఇంగ్లీష్ భాషలో సంఖ్యలకంటే తెలుగు భాషలో సంఖ్యలు విశేష అర్థము కల్గియున్నవి. **౧౨౩౪౫౬౭౮౯** ఇందులో మొదటి రెండు సంఖ్యలను వదలి చూస్తే మూడు కలదు. తర్వాత రెండు సంఖ్యలను వదలి చూస్తే ఆరు కలదు. దాని తర్వాత రెండు సంఖ్యలను వదలి చూస్తే తొమ్మిది కలదు. మూడు సంఖ్యను జీవాత్మగా, ఆరు సంఖ్యను ఆత్మగా, తొమ్మిది సంఖ్యను పరమాత్మగా చెప్పుకొన్నాము.

**౩౬౯** అంటే జీవాత్మకు గుర్తుగా, **౯౬౩** అంటే పరమాత్మకు గుర్తుగా చెప్పుకొన్నాము. అంతేకాక **౬౬౬** ని మాయకు నంబర్‌గా, **౯౬౩**ను సృష్టికర్త గుర్తుగా చెప్పుకొన్నాము. అంతేకాక అన్నిటికీ మధ్యలో గల ఆరును ఆరాధ్యదైవమైన దేవుడుగా అనగా ఆత్మగా చెప్పుకొన్నాము. ఈ విధముగా గణితములో యున్న సంఖ్యలను ఆధ్యాత్మికముతో పోలియుండునట్లు మన పెద్దలు అమర్చి సంఖ్యాశాస్త్రమైన గణిత శాస్త్రమును తయారు చేశారు.

ఈ గ్రంథముతోపాటు **"దేవుని గుర్తు 963"** అను గ్రంథమును చదివితే ఇక్కడ చెప్పిన జ్ఞానము కూడా బాగా అర్థమగును. అట్లే **"లు"**, **"తెలుగు"** అను గ్రంథమును చదివితే తెలుగు భాష గొప్పతనము పూర్తిగా తెలియగలదు. ఈ రెండు గ్రంథములు గతములో మా చేత వ్రాయబడినవే యని చెప్పుచున్నాము.

**ప్రశ్న :- మీరు దైవజ్ఞానమని, ఆధ్యాత్మిక జ్ఞానమని ఎన్నో విధముల అర్థమగునట్లు విశదీకరించి చెప్పుచున్నారు. అయితే కొందరు పూర్తి ధనము, పూర్తి అధికారము లేకున్నా కొద్దిపాటి**

